క్లియరసిల్ చర్మం మరింత నిర్మలమైన చర్మం. క్లియరసిల్ చర్మం మరింత నిర్మలమైన చర్మం.

# మీరు బయాలజీ తీసుకున్నా జియాలజీ తీసుకున్నా స్నేహితుల మధ్య బంధానికి క్లియరసిల్ తప్పనిసరి



## ఎందుకంటే క్లియరసిల్ చర్మం మరింత నిర్మలమైన చర్మం.

మీ జట్టులో మీరు వెలగిపోతూ వుండాలంటే ఈ ఫార్ములా బట్టీ పట్టండి. క్లియరసిల్ చర్మం. దీంతో మీరెప్పుడూ ఫెయిలవరు.

ఎందుకంటే క్లియరసిల్ చర్మం మరింత నిర్మలమైన చర్మం. దాంతో మిమ్మల్ని చూస్తున్న వాళ్ళు అలా చూస్తూనే వుండిపోతారు.

ఇదంతా మొటిమలపై మూడు రకాలుగా పనిచేసే క్లియరసిల్ విశిష్టత.

ఒకటి - ఇది మొటిమల్లోకి చొచ్చుకుపోతుంది. రెండు - ఎక్కువైన జిడ్డును తొలగిస్తుంది. మూడు - దీంతో

క్లియరసిల్ చర్మం మరింత నిర్మలమైన చర్మం. క్లియరసిల్ చర్మం మరింత నిర్మలమైన చర్మం.

క్లియరసిల్ చర్మం మరింత నిర్మలమైన చర్మం. క్లియరసిల్ చర్మం మరింత నిర్మలమైన చర్మం.




మొటిమలు ఎండిపోతాయి.

గొడవలేక తేలిపోయింది, మొటిమలను పోగొట్టడంలో క్లియరసిల్ ప్రపంచమంతటా నం. 1.

మరందుకే మొటిమలను మీ స్నేహాల దారికి అడ్డు రానివ్వకండి. క్లియరసిల్ తెచ్చుకోండి. మీ స్నేహాలకు కొరతే వుండదు.




మొటిమలను పోగొట్టడంలో క్లియరసిల్ ప్రపంచమంతటా నం.1.

క్లియరసిల్ చర్మం మరింత నిర్మలమైన చర్మం. క్లియరసిల్ చర్మం మరింత నిర్మలమైన చర్మం.

Enterprise/PG/CC/P/3/Tl b




1975
వనితల స్థితిగతులు
మెరుగుపరచడానికై....

* అంతర్జాతీయ మహిళా సంవత్సరంలో ఉదయించిన
ఏకైక స్త్రీజన పత్రిక ఏది?

వనిత

* దశాబ్దంన్నరగా స్త్రీలకు ఉపయుక్తమైన అనేక
అంశాలను ప్రస్తావిస్తున్న ఏకైక మాస పత్రిక ఏది?

వనిత

* మరి నెలతల ప్రియనెచ్చెలి ఏది?
నిస్సందేహంగా

వనిత

1991
వనితలను అభ్యుదయ పథంలో
నడిపించడంలో పదహారవ
సంవత్సరం....







కారణం
● విజ్ఞానానికి ● వికాసానికి ● వినోదానికి

వనిత

చందా వివరాలకు:
విజయా బుక్ హౌస్,
చందమామ బిల్డింగ్స్,
వడపళని, మద్రాసు - 600 026

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి


## ప్రగతి రహస్యం!

ప్రపంచంలో ప్రతి దేశానికీ ఒక ప్రత్యేక చరిత్ర ఉన్నది. ఏ దేశ చరిత్రను పరిశీలించినా మంచీ, చెడూ రెండూ కనిపిస్తాయి. మహోన్నత గత వైభవం గల మన దేశ చరిత్ర కూడా అంతే!

మనదేశం ఈనాడు ప్రజాస్వామ్యమార్గంలో పయనిస్తున్నది. ప్రజాస్వామ్య వ్యవస్థ ఇరుగుపొరుగు దేశాలలో పతనమైనప్పటికీ, మనదేశంలో అవిచ్ఛిన్నంగా కొనసాగుతున్నది. ఇది ఎంతైనా సంతోషించ తగ్గ విషయం.

అభిప్రాయభేదాలను గౌరవించి, భిన్నత్వంలో ఏకత్వం సాధించడంలోనే ప్రజాస్వామ్య విజయరహస్యం ఉన్నది. ఆచార వ్యవహారాలలో ఆంధ్రులకూ, పంజాబీలకూ సంబంధం లేదు. బెంగాలీలకూ, బీహారీలకూ మధ్య సామ్యం లేదు. అలాగే ఒక ప్రాంతానికీ మరొక ప్రాంతానికీ ఎన్నో భేదాలు ఉండవచ్చు. అయినా ప్రజలందరూ, అన్ని ప్రాంతాలూ కలిస్తేనే సువిశాల భారతదేశం సాధ్యం. ఇలా కలిసి ఉన్నప్పుడు ఒక రాష్ట్రానికి వున్న అవకాశాలు మరొక రాష్ట్రానికి లేవు అన్న స్థితి ఏర్పడకూడదు. ఒక రాష్ట్రానికన్నా మరొక రాష్ట్రం గొప్ప అన్న భావం కలగకూడదు. ఒకవేళ, పరిస్థితుల ప్రభావంవల్ల కొందరి హృదయాలలో అటువంటి ఆలోచనలు కలిగినా అవి శాశ్వతం కాకూడదు; వాటిని అప్పటికప్పుడే తొలగించి వేయాలి. అప్పుడే ఐకమత్యం సాధ్యమవుతుంది. ఐకమత్యంతో ప్రతి ఒక్కరూ కృషి చేస్తేనే దేశప్రగతి త్వరిత గతిలో సాగుతుంది!


సంపుటి 88 | ఫిబ్రవరి '91 | సంచిక 2

విడి ప్రతి : 3-00 | | సంవత్సర చందా : 36-00







# సురినామ్ దేశ సంఘటనలు

రామ్ సేవక్ శంకర్ అనగానే అదొక భారతీయుడి పేరు అని స్ఫురిస్తుంది. శంకర్ నిన్న మొన్నటివరకు సురినామ్ అధ్యక్షుడుగా ఉన్నాడు. సురినామ్ దక్షిణ అమెరికా ఈశాన్య తీరంలో ఉన్న చిన్న దేశం. మరి అంత దూరంలో వున్న ఆ దేశానికి ఒక భారతీయుడు ఎలా అధ్యక్షుడు కాగలిగాడు ?

సురినామ్ మొత్తం జనాభాలో భారతీయులు మూడోవంతు ఉన్నారు. నీగ్రోలు, ములటోలు కలిసి మరొక మూడోవంతు ఉన్నారు. మిగిలిన మూడోవంతు మిగతా జాతులవాళ్ళున్నారు. వారిలో ఇండోనేషియన్లు ముఖ్యులు. అక్కడ డచ్, హిందీ, స్రనాంటాంగో, జావనీస్ భాషలు మాట్లాడతారు.

సురినామ్, నెదర్లాండ్ కాలనీ ప్రాంతంగా ఉండేది. 1975 వ సం॥ స్వతంత్రదేశమయింది.

నాలుగు లక్షల జనాభాతో 1,63,820 చ॥ కి॥ విస్తీర్ణం గల సురినామ్ రాజధానీ నగరం పారామారిబో. వరిసాగుకూ, ఖనిజ సంపదకూ పేరొందిన దేశం సురినామ్.

సురినామ్ కూ, భారతదేశానికీ చరిత్ర పూర్వయుగం నుంచే సంబంధం ఉన్నది. మెక్సికో ప్రభుత్వం ప్రచురించిన, 'మెక్సికో చరిత్ర' ప్రకారం, "భారత





కర్నల్ బౌటర్



రామ్‌సవక్ శంకర్

దేశంనుంచి తూర్పుగా బయలుదేరిన వారే ప్రప్రథమంగా ఈ ఖండంలో, అంటే ఉత్తరోత్తరా అమెరికా అని పిలువబడిన భూభాగంలో అడుగు పెట్టారు.''

అయితే, ఇప్పుడు సురినామ్‌లో నివసిస్తున్న వాళ్ళందరూ ఇటీవలి కాలంలో అక్కడికి వలసవెళ్ళి స్థిరపడిన వాళ్ళే. ప్రభుత్వ యంత్రాంగంలో భారతీయులు ముఖ్యమైన పదవుల్లో వున్నారు. దేశాధ్యక్షుడయిన రామ్‌సేవక్ శంకర్ లాగే, మరొక భారతీయుడు జగన్నాథ్ లక్ష్మన్ నేషనల్ అసెంబ్లీ అధ్యక్షుడుగా ఉన్నాడు.

ప్రజాస్వామ్య దేశమయిన సురినామ్ పార్లమెంటులో 51 మంది సభ్యులు ఉంటున్నారు. అయినా, సైన్యమే చాలా శక్తివంతంగా కనిపిస్తున్నది. కొత్త సంవత్సరం ఆరంభం కావడానికి కొన్నిరోజులే వుందనగా రామ్‌సేవక్ శంకర్ అధ్యక్ష పదవికి రాజీనామా చేశాడు. కర్నల్ బౌటర్స్ నాయకత్వంలోని సైన్యం ఒత్తిడి కారణంగానే శంకర్ రాజీనామా చేసినట్టు తెలుస్తున్నది. అయినా, అధ్యక్షుడి రాజీనామాతో తమకెటువంటి సంబంధంలేదని సైన్యం తరఫున చెబుతున్నారు. పరిస్థితి స్పష్టంగా తెలియడానికి మరి కొంతకాలం పట్టవచ్చు!



# సమీరుడి గొప్పకథ

ఒకానొకప్పుడు ధర్మసేనుడనే రాజు ప్రజారంజకంగా రాజ్యమేలే వాడు. ఆయనకు ముగ్గురు కొడుకులు. పెద్దవాడు ప్రజ్ఞాశాలియే కానీ, తర్వాతి ఇద్దరూ అతడి కంటే చురుకైన వాళ్ళు. విద్యాభ్యాసం పూర్తికాగానే, ముగ్గురికీ కూడా రాజు కావాలన్న అభిలాష పుట్టింది. ఇది గ్రహించి ప్రతివాడి చుట్టూ కొందరు అనుచరులు చేరి దుర్బోధలు చేయసాగారు. ఈ విధంగా కొంతకాలానికి రాజు కొలువులో అన్ని విభాగాలవారూ మూడు తెగలుగా విడిపోయారు.

ధర్మసేనుడికి ఈ పరిస్థితి చికాకు కలిగించింది. ఆయన కొంత కాలంపాటు భార్యాబిడ్డలకు రాజ్యాన్ని వదిలి, తను సమీపారణ్యంలో కొంతకాలం గడిపి వస్తానన్నాడు. కొడుకులను తనకంటే రాణి బాగా అదుపు చేయగలదని రాజు నమ్మకం.

అరణ్యంలో ధర్మసేనుడికి, వాసవుడనే అతను తటస్థపడ్డాడు. వాసవుడికి బంధుమిత్రులంటే రోతపుట్టి, విరక్తిభావంతో అరణ్యానికి వచ్చి చేరాడు. ఆయన భార్యాబిడ్డలు కూడా వెంట వచ్చి అరణ్యంలో వుంటున్నారు. వాళ్ళొక పర్ణకుటీరాన్ని నిర్మించుకుని, అరణ్యంలో లభించే పదార్థాలతో తృప్తిపడుతూ సుఖంగా జీవిస్తున్నారు.

ధర్మసేనుడు, వాసవుడి కథ విని ఆశ్చర్యపడి, ''ఇలా ఎంతకాలమని ఇక్కడుంటారు? అయినా, ఈ అరణ్య జీవితం మీకు విసుగనిపించదా?'' అని అడిగాడు.

''ప్రతి మనిషీ తన భార్యాబిడ్డలకోసం జీవిస్తాడు. నా భార్యాబిడ్డలు నాతోనే వున్నారు. ఇంక విసుగు దేనికి?'' అన్నాడు వాసవుడు.

"వసుంధర"



పూర్తిచేశాక, నా బిడ్డలు మనుషుల మధ్యకు వెళ్ళి సుఖంగా బ్రతకగలరని నా నమ్మకం. ఒకవేళ బ్రతకలేరూ— అప్పటికే అరణ్యజీవనానికి అలవాటు పడ్డారు కాబట్టి, వాళ్ళకు సమస్య లేనే లేదు,'' అన్నాడు వాసవుడు.

ధర్మసేనుడు, వాసవుడు అప్పటికే రాసిన వేయి కథలను విని, అయనకు నమస్కరించి, ''మహానుభావా! నువ్వు సామాన్యుడివి కాదు. నీ కథలు నిజంగానే ఎంతో ప్రయోజనకరమైనవి. వాటిలో సామాన్యులకు అవసరమైన సందేశాలున్నాయి. మీ కథల సాయంతో నేనిప్పుడు సమస్యలను పరిష్కరించుకోగలను. తమరు నా రాజ్యానికి వచ్చి కొంతకాలం, నా అతిథ్యం తీసుకుని వెళ్లాలి,'' అన్నాడు.

వాసవుడు దీనికి బదులుగా మందహాసం చేసి, ''మహారాజా! మీరు మానసికంగా చీకాకుల్లో వున్నారు. మీకు అవసరమైన పరిష్కారమార్గం వాటిలో కనబడడంవల్ల, నా కథలు మీకు నచ్చాయి తప్ప, అవి అంత విశేషమైనవి కావు. కేవలం నా అనుభవాలను పురస్కరించుకుని, ఏ ధర్మశాస్త్రం ఆధారం లేకుండా రాసిన కథలివి. వీటి ద్వారా ప్రజలకు సందేశమివ్వాలని, నేననుకోవడం లేదు. నా తృప్తికోసం నేను రాసుకుంటున్న

ఇందుకు ధర్మసేనుడు, ''మనిషి సంఘజీవి. మనుషులకు దూరంగా వుండడంలో అనందమేముంటుంది? మీ బిడ్డలు పెద్దవాళ్ళయేసరికి మనుషుల సంప్రదాయాలు తెలియకుండా పోతాయి. ఏదో ఒక రోజున వాళ్ళయినా మనుషుల మధ్య జీవించాల్సిందే కదా!'' అన్నాడు.

''మనుషుల సంప్రదాయాల గురించీ, వాటి మంచిచెడ్డల గురించీ విశ్లేషిస్తూ నేను కథలు రాస్తున్నాను. అదే నా బిడ్డలకు చదువు. ఏ విషయమైనా కథ రూపంలో చెబితే అది చాలా మంచి చదువవుతుందని పంచతంత్ర కథలు ఋజువు చేశాయి. నా దగ్గిర చదువు

ఈ కథలకు, మీ ద్వారా ప్రచారం లభిస్తే అది నా అదృష్టంగా భావిస్తాను. అయితే, మరొక సంవత్సర కాలందాకా నేను కథలు రాయదలిచాను. ఆ లక్ష్యం పూర్తయ్యాక తప్పక మీ రాజ్యానికి వచ్చి, తమ దర్శనం చేసుకోగలను,'' అన్నాడు.

ధర్మసేనుడు సరేనని తన రాజ్యం చేరి, వంశపారంపర్యంగా రాజ్యాన్నేలే హక్కును తన బిడ్డలకు రద్దుచేసి, ప్రజలే ప్రభువుల నెన్నుకునే కొత్త పద్ధతిని ప్రవేశపెట్టాడు. ఆ విధంగా రాజ్యకాంక్ష వున్నవాడు అనుచరులను చేరదీయడం మానివేసి, ప్రజాసేవ గురించి ఆలోచించడం తప్పనిసరి అయింది.

ఇది ఇలా వుండగా, వాసవుడు రాజు కిచ్చిన మాట ప్రకారం, ధర్మసేనుడి రాజ్యానికి బయల్దేరాడు. భార్యాబిడ్డలు వెంటరాగా, ముందుగా అయన ఒక పట్టణం చేరుకుని ధర్మసత్రంలో బస చేశాడు. అక్కడ అయనకు సమీరుడనే యువకుడు తటస్థపడ్డాడు.

సమీరుడు, వాసవుడెవరో, ఎందుకక్కడికి వచ్చాడో తెలుసుకున్నాక, అయనకు నమస్కరించి, ''అయ్యా! తమరిని కలుసుకోవడం నా అదృష్టం. అనుభవంలోకి వచ్చిన విశేషాలను కథల రూపంలోకి మార్చి రాయడం నాకూ అలవా



టుంది. అలా ఇప్పటికి వంద కథలు రాశాను. వాటిపై మీ అభిప్రాయం చెప్పాలి,'' అన్నాడు.

వాసవుడు సరేనని, సమీరుడి కథలన్నీ చదివేవరకూ అక్కడే వున్నాడు. తర్వాత అయన సమీరుడి కథలను మెచ్చుకుని, ''నాయనా! ఎన్నో ఏళ్ళ అనుభవంతో సాధించిన నా విద్యను, ఇంత చిన్నతనంలోనే నువ్వు సాధించావు. నీవంటివాడికి మహారాజు ప్రాపకం వుంటే ప్రజలకెంతో మేలు జరుగుతుంది. నీ గురించి రాజు ధర్మసేనుడికి చెబుతాను,'' అన్నాడు.

దీనికి సమీరుడెంతో సంతోషించి, ''అయ్యా! మహారాజు ప్రాపకంపట్ల నాకు




సూటిగా చెప్పినా నేనేమీ అనుకోను,'' అన్నాడు.

దీనికి వాసవుడు నొచ్చుకుని, "నాయనా! నీ కథ నాకు నచ్చలేదని నేననలేదే! నువ్వలా ఎందుకనుకున్నావు?" అన్నాడు.

''నేను రాసిన వాటిలోకల్లా గొప్ప కథ అని చెప్పాను. అది చదివి మీరు వివరణ కావాలంటున్నారు. దాన్నిబట్టి అలా అనుకున్నాను,'' అన్నాడు సమీరుడు.

''నిస్సందేహంగా నీ కథలు గొప్పవి. ఈ కథలో గొప్పతనం నాకు అర్థం కాక, నీ నుంచి తెలుసుకోవాలనుకున్నాను,'' అన్నాడు వాసవుడు.

''మీరు నన్ను వెటకారం చేస్తున్నారు. మీకు గజిబిజిగా వుండి అర్థం కానప్పుడు, నా కథలు గొప్ప వెలా అవుతాయి?'' అన్నాడు సమీరుడు బాధగా.

ఇందుకు వాసవుడు కాస్త చిరాగ్గా, ''నీవి నూటొక్క కథలు చదివాను. వాటిలో నూరు నాకర్థమై చాలా గొప్పవని పించాయి. ఒక్కటంటే ఒక్కటి అర్థం కాలేదు. నువ్వు పక్కనే వున్నావు కాబట్టి, నిన్నడిగి అర్థం చేసుకోవాలనుకున్నాను. నీ నూరు కథలూ నాకు నచ్చి వుండక పోతే, ఈ కథ గురించీ నేను పట్టించుకునే వాణ్ణి కాదు. వాదన కట్టిపెట్టి, ఏ ఉద్దేశంతో ఈ కథ రాశావో చెప్పు,'' అన్నాడు.

ఆసక్తిలేదు. నా తృప్తికోసం కథలు రాస్తున్నాను. ఎన్నో గొప్ప కథలు రాసిన మీరు, నా కథల్ని మెచ్చుకోవడం నాకు గర్వకారణం. ఇప్పుడు మీకు, నేను రాసిన కథలన్నింట్లోనూ గొప్పదని నేనను కునే కథ చూపిస్తాను. మీ అభిప్రాయం చెప్పాలి,'' అన్నాడు.

వాసవుడు, సమీరుడిచ్చినతాళపత్రాలు తీసుకుని కథ చదివి, ''నాయనా! నాకీ కథ గజిబిజిగా వుండి అర్థం కావడం లేదు. నువ్వు కాస్త వివరించి చెప్ప గలవా?'' అన్నాడు.

సమీరుడికి మనసు చివుక్కుమన్నది. ''మీకు నా కథ నచ్చలేదు. ఆ విషయం

దానికి సమీరుడు కోపంగా, "ప్రతి కథలోనూ సందేశం వుండాలా? సందేశం లేనిది మంచి కథ కాదా? నేను ప్రజలకు ఏదో సందేశమివ్వాలని కథలు రాయడం లేదు. నా అనుభవాలను అందంగా రాసి, అందరికీ పంచి పెట్టాలనుకున్నాను," అన్నాడు.

ఈ జవాబు విని వాసవుడు తనను తాను తమాయించుకుని, "నేను కథలోని సందేశం మాట ఎత్తలేదు; ఏ ఉద్దేశంతో కథ రాశావని అడిగాను. ఉద్దేశం వేరు, సందేశం వేరు. అయితే ప్రతి కథకూ ఒక ఉద్దేశముంటుంది. సందేశమివ్వాలని రాసే కథ మంచిది కాదని కూడా, నా అభిప్రాయం. ఉదాహరణకు, కృష్ణుడు చిన్నతనంలో యశోదను చిలిపి చేష్టలతో వేధించేవాడు. ఆ చేష్టలను అందమైన కథలుగా రాస్తే వాటిలో సందేశమేమీ వుండదు. చదివినవారు తమ బిడ్డల్లో చిలిపి కృష్ణుణ్ణి చూసుకుని ఆనందిస్తారు. చిన్నారుల చిలిపి చేష్టల్ని వర్ణించడం, ఆ కథల ఉద్దేశ్యం," అన్నాడు.

అప్పుడు సమీరుడు తనే విషయాన్ని దృష్టిలో వుంచుకుని, ఏ ఉద్దేశ్యంతో ఆ కథ రాశాడో చెప్పాడు: ఒక ప్రసిద్ధ దేవాలయంలో కొందరు శిల్పులుండే వారు. వాళ్ళల్లో ఒక యువశిల్పి తయారు



చేసిన శిల్పాలు అద్భుతంగా వుండేవి. అయినా, ప్రధాన శిల్పి అవి బాగా లేవని ఈసడించి, వాటిని ఆలయధర్మకర్తలు చూడకుండా అడ్డుకునేవాడు. చివరకు యువశిల్పి విసిగిపోయి, తను చెక్కిన శిల్పాలన్నిటినీ విరగగొట్టి, జీవితంపట్ల విరక్తుడై ఎటో వెళ్ళిపోయాడు.

"ఇప్పుడు నా కథ గురించి తమ అభిప్రాయం చెప్పండి!" అని అడిగాడు సమీరుడు.

ఇందుకు వాసవుడు చిరునవ్వునవ్వి, "ఈ వివరణ ముందే ఇస్తే అనవసరంగా ఇంత వాదన జరిగేదికాదు. ఏది ఏమైనా, నీ ఈ కథపై నా అభిప్రాయం చెప్పను.

నా చిత్తశుద్ధి, నిజాయితీల పట్ల నీకు నమ్మకం లేదు,'' అన్నాడు.

ఆ తర్వాత ఆయన సకుటుంబంగా రాజధాని చేరుకుని, రాజును దర్శించి, ''ప్రభూ! తమ రాజ్యంలో పేరు పొందిన కవులందరూ అహంకారపూరితులు, గర్విష్ఠులు అని నాకు అనిపిస్తున్నది. సాహిత్యానికిది తీరని కళంకం. ప్రజల మనోవికాసానికిది అనర్థం!'' అంటూ సమీరుడితో తనకు కలిగిన అనుభవమంతా పూసగ్రుచ్చినట్లు చెప్పాడు.

ఇది విని రాజు ధర్మసేనుడు ఆశ్చర్యంగా, ''అయ్యా! సమీరుడు గొప్పవాడు కాదు. అతడెవడో నాకు తెలియదు. అలాంటి వాడితో జరిగిన అనుభవాన్ని పురస్కరించుకుని, మొత్తం నా రాజ్యంలోని కవులందర్నీ అనుమానించడం తమ బోటివారికి తగదు,'' అన్నాడు.

వాసవుడు దీనికి మందహాసం చేసి, ''ప్రభూ! సమీరుడి వంటి గొప్ప కథకుడి గురించి, మీకింకా తెలియదంటే, అది మీకు అవమానం. అలాంటి కథకుల్ని మీదాకా రాకుండా చేస్తున్న కవులెవరో, మీరు తెలుసుకోవాలి. నేను సమీరుడి కథలు గొప్పవంటే, అతడు వెటకారం చేస్తున్నాననుకున్నాడు. నేను రాజాదరణ పొందబోతున్న గొప్పవాడినని అతడి అభిప్రాయం. గొప్పవాళ్ళు తనను వెటకారం చేస్తారే తప్ప, పొగడరనే నమ్మకం అతడిలో బలపడిపోయింది. అందుక్కారణం, తమ రాజ్యంలోని పేరుబడ్డ కవులా, పండితుల అసూయా పూరితమైన ప్రవర్తన. పేరు పొందిన వారిలో వినయ గుణముంటుందనీ, వాళ్ళు కథకుడిలో కాక, కథలో గొప్పతనం వెదకడానికి తాపత్రయపడతారనీ సమీరుడి వంటి వాళ్ళు తెలుసుకునేలా, మీరు సాహిత్యాన్ని ఆదరించాలి,'' అన్నాడు.

ధర్మసేనుడు, వాసవుడి హెచ్చరికను గ్రహించి, సమీరుడి వంటి వాళ్ళను వెతికి పట్టుకుని ఆదరించే పద్ధతులు అనుసరించి సాహిత్యపోషకుడిగా పేరు తెచ్చుకున్నాడు.






## 18

[వీరసింహుడు అనుకున్నవి ఏ. ఒక్కటీ జరగలేదు. జయపురినుంచి అపహరించిన బంగారు విగ్రహం-మార్గంలోనే మాయమయింది. వివాహమాడాలనుకుని జయపురి నుంచి శాంతి పురానికి తీసుకువస్తూన్న యువరాణి తప్పించుకున్నది. రాజభవనంలో లభించిన రహస్య నిధులను వ్యాపారుల వేషాలలో వచ్చిన తిరుగుబాటుదార్లు తరలించుకు వెళ్ళారు.—తరవాత]

"నాకు నా మనవణ్ణి చూడాలని ఉన్నది వసంతా," అన్నాడు అమృతపురి రాజు సత్యసేనుడు.

"తన తండ్రి రాజ్యాన్ని మళ్ళీ తన వశం చేసుకున్న తరవాతే, యువరాజు సందీపుడు తమను దర్శించి ఆశీస్సులు పొందాలని ప్రతిజ్ఞ బూనాడు ప్రభూ! అంతవరకు ఓర్పు వహించక తప్పదు. ఉదారగుణ సంపన్నుడయిన ఆ సాహస వీరుడి ఆదేశం ప్రకారమే మేము మా పోరాటం సాగిస్తున్నాం. మీ ఆశీర్వాద బలంతో, ఇప్పుడు మేము వీరసింహుడి సేనలను ముఖాముఖీ ఎదుర్కొనే స్థాయికి ఎదిగాం, ప్రభూ!" అన్నాడు వసంతుడు.

"వసంతా, సందీపుణ్ణి తలుచుకుంటే నాకెంతో ఆనందంగా ఉన్నది. అయినా, నుమేధ రాజ్యాన్ని అసలువారసుడికి అప్పగించడానికి మీరు సాగిస్తూన్న ధర్మ



పోరాటంలో నేనూ నా కర్తవ్యాన్ని నిర్వహించాలి కదా!'' అన్నాడు సత్యసేనుడు.

''ప్రభూ, తమ అండదండలవల్లే కదా మా పోరాటం నిరాటంకంగా సాగుతున్నది? తమ సైనికులే మాకు శిక్షణనిస్తున్నారు. పైగా, మా ఆత్మవిశ్వాసానికి మూలాధారం అమృతపురి సైన్యం అన్న సంగతి మీకు తెలియనిదా? అయినా, మేము జరుపనున్న ఆఖరి పోరాటంలో మీ సైన్యం కీలకపాత్ర వహించవలసి ఉన్నది!'' అన్నాడు వసంతుడు ఆవేశంతో.

రాజు సత్యసేనుడు మంత్రినీ, సేనాధిపతినీ పిలిపించాడు. నలుగురూ రహస్యాలోచనలు జరపసాగారు!

''మళ్ళీ ఒక అద్భుతం జరిగింది, ప్రభూ!'' అన్నాడు ప్రధాన గూఢచారి వీరసింహుడితో.

''ఏమిటది?'' అని అడిగాడు వీరసింహుడు.

''కోతిపిల్ల, యువరాణి సుకన్యగా మారిపోయింది ప్రభూ,'' అన్నాడు గూఢచారి!

''నిజంగానా! సుకన్య ఇప్పుడెక్కడ ఉన్నది?'' అంటూ లేచి నిలబడ్డాడు వీరసింహుడు.

''ఆమె తల్లిదండ్రుల వద్ద ఉన్నది, ప్రభూ,'' అన్నాడు గూఢచారి.

''జయపురిలోనా? అయితే ఆ సంగతి శంకరవర్మ మనకింకా ఎందుకు తెలియజేయలేదు?'' అని వీరసింహుడు కొంతసేపు తీవ్రంగా ఆలోచించి, ఒక రాజోద్యోగిని, దగ్గరికి పిలిచి, ''శంకరవర్మతో కఠినంగా ప్రవర్తించడం మాకు ఇష్టం లేదు. రేపో మాపో అతని కుమార్తెను పెళ్ళాడాలి కదా! అందుకే నువ్వు జయపురికి వెళ్ళి మేమే వచ్చి స్వయంగా సుకన్యను వెంటబెట్టుకుని వెళతామని శంకరవర్మకు మా మాటగా తెలియజెయ్. ఈసారి ప్రయాణ సమయంలో మేము సుకన్యను ఒక్క క్షణం కూడా వదిలి వుండము. అంతేకాదు. సుకన్య మళ్ళీ

కోతిపిల్లగా మారిపోకుండా చూసుకోవ డానికి ఒక గట్టి మాంత్రికుడు కూడా మా వెంట ఉంటాడు!'' అన్నాడు.

అప్పుడే, పొడవాటి గడ్డంతో, విచిత్ర వేషధారణతో ఒక మాంత్రికుడు అక్క డికి వచ్చాడు.

శంకరవర్మ దగ్గరికి వెళ్ళిన దూత తిరిగి వచ్చి, వీరసింహుడికి నమస్క రించి, ''ఘోర అవమానం జరిగి పోయింది ప్రభూ. నన్నూ, నన్ను దూతగా పంపిన మిమ్మల్నీ ఘోరంగా అవమానిం చారు ప్రభూ!'' అన్నాడు.



''ఏమిటీ! మమ్మల్ని అవమానించ డమా! ఎవరాపని చేసిన నీచులు?'' అని అడిగాడు వీరసింహుడు కోపంగా.

''మీ దూతనైన నన్ను చూడడానికే మొదట నిరాకరించారు ప్రభూ. శంకర వర్మ సలహాదారుడయిన ఒక యువ కుడు....మిమ్మల్ని....మిమ్మల్ని....'' అని ఆ తరవాత ఏదో చెప్పడానికి భయ పడ్డాడు.

''ఏమన్నాడేమిటి?'' అని గద్దించాడు వీరసింహుడు.

''ఆ యువకుడు, 'యువరాణి కోతి పిల్లగా మారిపోయిందని భ్రమపడిన వీర సింహుడే అసలు కోతి. ఆ దుష్టుడి బారి నుంచి మా యువరాణి సుకన్య ఉపా యంతో తప్పించుకున్నది. యువరాణి కోరిక మేరకే కోతిపిల్ల వీరసింహుడి ముఖాన్ని గాయపరచింది. ఇంతకుమించి, మేము వీరసింహుడికి చెప్పవలసిందేమీ లేదని చెప్పు,' అని చెప్పాడు ప్రభూ,'' అన్నాడు దూత.

''అంత పొగరా! ఈ క్షణమే శంకర వర్మనూ, వాడి రాజ్యాన్నీ సర్వనాశనం చేస్తాను. సుకన్యకు నిలవ నీడలేకుండా చేస్తాను. జయపురి ప్రజలందరినీ హత మారుస్తాను. ఇళ్ళను నేలమట్టం చేయిస్తాను, ఆఖరికి గొడ్డూ గోదను కూడా వదిలిపెట్టను!'' అని అరిచాడు వీర సింహుడు.



''తమను అవమానించిన ఆ నీచులకు సరైన గుణపాఠం నేర్పాలి ప్రభూ!'' అన్నాడు దూత.

వెంటనే వీరసింహుడు సర్పదంతుణ్ణి పిలిపించి, ''ఈ క్షణమే మనం జయపురి మీదికి దండెత్తాలి. సైన్యం సిద్ధం చెయ్. ఏది ఏమైనా ఫరవాలేదు!'' అని ఆజ్ఞాపించాడు.

''జయపురి సుమేధ రాజ్యంలో ఒక భాగంగా కలిసిపోతుంది తప్ప మరే ప్రమాదమూ ముంచుకురాదు ప్రభూ. పైగా జయపురి విజయం మన సైనికులలో నూతనోత్తేజం కలిగిస్తుంది,'' అన్నాడు సర్పదంతుడు.

''అవును, చాలా కాలంగా మన సైనికులు కేవలం మన జీతబత్తాలతోనే కాలక్షేపం చేస్తున్నారు. జయపురిని జయించారంటే అక్కడి ధనాన్ని కొల్లగొట్టవచ్చు. అయినా, కొల్లగొట్టిన వాటిలో విలువైన ఆభరణాలనూ, ధనాన్నీ మనకు అప్పగించాలనుకో....ఏమంటావు?'' అని అడిగాడు వీరసింహుడు.

''అక్షరాలా నిజం ప్రభూ! మీ ఆజ్ఞానుసారం ఇప్పుడే సైన్యాన్ని సిద్ధం చేస్తాను,'' అన్నాడు సర్పదంతుడు.

పొరుగుదేశాన్ని కబళించాలన్న దురాశ కారణంగా, సర్పదంతుడికి జయపురికి సైన్యమే లేదన్న విషయం స్ఫురించలేదు. ఇక వీరసింహుడికి, శంకరవర్మ మీద వెంటనే పగసాధించాలన్న దురాగ్రహం కొద్దీ, జయపురికి సైన్యం లేకపోయినా శంకరవర్మ, అమృతపురి రాజు సహాయాన్ని అర్థించవచ్చునన్న ఆలోచన రాలేదు!

సర్పదంతుడు అక్కడి నుంచి వెళ్ళిపోయాక, వీరసింహుడికి ఆ సంగతి హఠాత్తుగా స్ఫురించి పక్కనే వున్న మాంత్రికుడితో, ''మన సైనికులు ఎంతటివారినైనా ఎదుర్కొని వెనుదిరగకుండా పోరాడడానికి ఏదైనా మార్గం ఉన్నదా?'' అని అడిగాడు.

"లేకేం ప్రభూ! సైనికులేనా? వాళ్ళు ఎక్కిన గుర్రాలు కూడా ఒక్క అడుగు వెనక్కు వేయకుండా ముందుకు సాగేట్టు చేయగలను. గుర్రాలకు పెట్టే మేతలో మంత్రజలం చల్లుతాను. ఆ మేత తిన్న గుర్రాలకు శత్రుసైనికులంటేనే కాదు; జలప్రవాహమన్నా, అగ్ని జ్వాలలన్నా ఎలాంటి భయం ఉండదు. గుర్రాలు వెనుదిరగనప్పుడు వాటిపై వున్న సైనికులెలా వెనక్కు రాగలరు చెప్పండి," అన్నాడు మాంత్రికుడు మందహాసంతో పొడవాటిగడ్డాన్ని చేత్తో దువ్వుకుంటూ.



"శభాష్!" అన్నాడు వీరసింహుడు.

మధ్యాన్నానికి సైన్యం సిద్ధమయింది. సర్పదంతుడూ, మాంత్రికుడూ వెంటరాగా వీరసింహుడే సైన్యాన్ని నడిపించాడు. సాయంకాలానికి జయపురి రాజ్యసరిహద్దులను చేరారు. అప్పుడు మాంత్రికుడు, "ప్రభూ, మనం రాత్రికి ఇక్కడే బసచేసి, మంత్రజలం చల్లిన మేతను గుర్రాలకు పెడదాం. తెల్లవారేసరికి ఒక్కొక్క గుర్రానికి ఐదు గుర్రాల బలం వస్తుంది!" అన్నాడు.

"అలాగే చేద్దాం. వేకువజామున జయపురిని ముట్టడిద్దాం!" అన్నాడు వీరసింహుడు.

ఆ రోజు రాత్రి, మాంత్రికుడు నిష్ఠతో ఏవేవో మంత్రాలు చెబుతూ, కమండలం వంటి పెద్ద పాత్ర నుంచి, మంత్రజలాన్ని మేతపై చిలకరించి, ఆ మేతను గుర్రాలకు తినిపించాడు.

తెల్లవారగానే వీరసింహుడు, గుర్రంపై ఎక్కి సైనికులను, "ఇప్పుడు మన గుర్రాలకు అపురూపమైన మంత్రశక్తి ఉన్నది. ఎవరెదిరించినా సరే, విజయం మనదే! ధైర్యంగా ముందుకు సాగండి," అని ఆజ్ఞాపించాడు.

అయితే వాడెక్కిన గుర్రం కూడా ముందుకు కదలలేదు. దానిని అదుపు చేయడం కూడా కష్టమనిపించింది. గుర్రం బలం పెరిగిందనుకుని వీరసింహుడు ఒక్కక్షణం సంతోషించాడు.



ఒక్కొక్కరూ, కిందపడసాగారు. మరి కొందరు గుర్రపు రికాబులలో పాదాలు పట్టుకుపోవడం వల్ల గుర్రాలపై నుంచి తల్లకిందులుగా వేలాడసాగారు.

"సర్వదంతా ఏమిటిదంతా? మాంత్రికుడు ఏం చేశాడు?" అని అరిచాడు వీరసింహుడు.

గుర్రాలపైనుంచి కింద పడకుండా ఉండడానికి ఇద్దరూ నానా తంటాలు పడసాగారు.

"దుర్మార్గుడా, ఇలా చూడు!" అని ఒక గంభీర కంఠస్వరం వినిపించింది.

వీరసింహుడు తల పైకెత్తి చూశాడు.

రాజభవనం ఉపరితలం మీద కనిపించిన మాంత్రికుడు తన పొడవాటి గడ్డాన్నీ, తలపై పెట్టుకున్న పెద్ద జుట్టునూ తీసి పక్కన పెడుతూ, "నేను గుర్తున్నానా?" అని అడిగాడు.

"నువ్వు....నువ్వు....శాంతిదేవుడి దుష్ట మంత్రివి. మాంత్రికుడి వేషంలో వచ్చి మోసం చేశావా?" అని హుంకరించాడు వీరసింహుడు.

"నిజమే. నిన్ను నేను మోసం చేశాను! మీ గుర్రాలకు పిచ్చెత్తేలాగా చేశాను. అయినా, ధర్మాత్ముడయిన శాంతిదేవ మహారాజుకు నువ్వు చేసిన ద్రోహంలో ఇదేపాటి? వెంటనే సైన్యంతో సహా

మరుక్షణమే గుర్రం ఒక్కసారిగా ముందరికాళ్ళు పైకెత్తి వింతగా సకిలించడంతో, వీరసింహుడు అనుమానంగా వెనక్కు తిరిగి చూశాడు. మిగతా గుర్రాలను అదుపుచేయడానికి సైనికులందరూ నానా తంటాలు పడుతున్నారు.

"ఉరకండి ముందుకు!" అని హెచ్చరించాడు వీరసింహుడు.

అతికష్టం మీద సైన్యం జయపురి రాజభవనాన్ని సమీపించింది. అయితే, రాజభవనాన్ని చుట్టుముట్టాలనుకున్నప్పుడు, గుర్రాలన్నీ ముందుకు కదలకుండా వెనకకాళ్ళపై లేచి భయానకంగా సకిలించసాగాయి. దాంతో సైనికులు

లొంగిపో! లేదా ఒక్కరి ప్రాణం కూడా దక్కదు!'' అని హెచ్చరించాడు వృద్ధ మంత్రి.

''ప్రాణాలు దక్కవా? నువ్వూ, ముసలివాడైన ఆ శంకరవర్మ కలిసి, సుమేధ సైన్యంతో వచ్చిన మా ప్రాణాలు తీయగలరా?'' అంటూ వీరసింహుడు హేళనగా నవ్వాడు.

''మూర్ఖుడా! కళ్ళు తెరచి అటు చూడు!'' అన్నాడు వృద్ధమంత్రి.

మరుక్షణమే వందలాది సైనికులు ఆయుధాలతో కోట బురుజుల మీదికి వచ్చారు.

ఆ దృశ్యాన్ని చూసిన వీరసింహుడి గుండె దడదడలాడింది!

అప్పుడే వృద్ధమంత్రి దగ్గరికి వచ్చిన శంకరవర్మ, ''వీరసింహా! రక్తపాతాన్ని అరికట్టడానికే మేము నిన్ను రెచ్చగొట్టి ఇక్కడికి సైన్యంతో వచ్చేలా చేశాము. ధర్మప్రభువయిన శాంతిదేవ మహారాజు కుమారుడు యువరాజు సందీపుడి ఆదేశానుసారమే ఈ పథకం రూపొందించాము. ప్రాణాలపై ఆశవుంటే మర్యాదగా లొంగిపోయి, యువరాజు శరణు వేడుకో. నీ సైన్యాన్ని అమృతపురి సేనలు చుట్టుముట్టాయి. శాంతిపుర రాజభవనం తిరుగుబాటుదార్ల నాయకుడయిన వసంతుడి



వశమయింది. మర్యాదగా లొంగిపో,'' అని హెచ్చరించాడు.

వీరసింహుడు చుట్టుపక్కల ఒకసారి కలయజూశాడు. సైనికులు చాలామంది కిందపడి గాయాలతో మూలుగుతున్నారు.

"సుమేధ సైనికులారా, ఇటు చూడండి! ఇదిగో మీ శాంతిదేవ మహారాజుగారి కుమారుడు యువరాజు సందీపుడు!'' అన్నాడు శంకరవర్మ.

యువరాజు సందీపుడు శంకరవర్మ పక్కన వచ్చి నిలబడ్డాడు.

"యువరాజు సందీపుడికీ....జై....జై,'' అంటూ సైనికులు జయ జయ ధ్వానాలు చేశారు.

"శభాష్! మీరందరూ లొంగిపోయినట్టు భావిస్తున్నాను. ఆయుధాలను కింద పడవేసి ఒక పక్కగా వచ్చి నిలబడండి. మిమ్మల్ని క్షమించి, సుమేధ రాజ్య సైన్యంలోనే కొనసాగే విధంగా చూస్తాం," అని, శంకరవర్మ వీరసింహుడి కేసి తిరిగి, "వీరసింహా ఇదే తుది హెచ్చరిక! యువరాజు శరణుపొంది, ప్రజా సమక్షంలో విచారణకు నిలబడు. లేదా నీ ప్రాణాలు దక్కవు!" అని అన్నాడు.

వీరసింహుడు విచారంగా ఏదో ఆలోచిస్తూ వుండగా అతడెక్కిన గుర్రం హఠాత్తుగా ముందరి కాళ్ళెత్తి సకిలించి అతణ్ణి దభీమని కిందపడతోసి దూరంగా పారిపోయింది.

శంకరవర్మ అంగరక్షకులు వీరసింహుణ్ణి బంధించి చెరసాలకు నడిపించారు.

సర్పదంతుడు యువరాజుకు లొంగిపోతున్నట్టు చేతులు పైకెత్తాడు. వాణ్ణి కూడా భటులు బంధించారు.

యువరాజు సందీపుణ్ణి చూసి తాతగారయిన అమృతపురి రాజు సత్యసేనుడు ఆనందబాష్పాలు రాల్చాడు. క్రూరుడయిన వీరసింహుడి అరాచకాలు అంతమొందినందుకు సుమేధరాజ్య ప్రజలు పరమానందం చెందారు.

జయానందముని సమక్షంలో సందీపుడికి సుమేధరాజ్య పట్టాభిషేకం జరిగింది. సందీపుడు తన పరివారంతో సహా అరణ్యానికి వెళ్ళి, తల్లిదండ్రుల సమాధులకు భక్తిపూర్వకంగా నమస్కరించి, అక్కడ స్మారక మందిరాలు నిర్మించడానికి ఏర్పాటు చేశాడు.

ఆ తరవాత, సందీపుడికీ సుకన్యకూ వైభవోపేతంగా వివాహం జరిగింది. వారసులు లేనందువల్ల అమృతపురి, జయపురి రాజ్యాలు కూడా సుమేధతో కలిసి సువిశాల సామ్రాజ్యం ఏర్పడింది.

రాజు సందీపుడూ, రాణి సుకన్యాదేవీ చిరకాలం ప్రజానురంజకంగా పరిపాలన జరిపారు. —(ఐపోయింది)






# సాహసవంతుడు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవ సాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా, ఇంత అర్ధరాత్రివేళ, భీతిగొలిపే ఈ శ్మశాన ప్రాంతాన, కన్ను పొడుచుకున్నా కానరాని కటికచీకటిలో నువ్వు పడుతున్న శ్రమ, ఎంతో ధీరుడూ, సాహసవంతుడూ అయిన వాడికిగాని సాధ్యపడదు. అయితే, కొన్ని సమయాలలో ఎంతటి ధీరులూ, సాహస వంతులూ కూడా అసందర్భంగా, అవివేకంగా ప్రవర్తించి, తమ గౌరవ మర్యాదలను కోల్పోతారు. ఈ విషయంలో నీకు హెచ్చరికగా వుండేందుకుగాను, శ్రీకాంతుడనే వాడి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను,'' అంటూ ఇలా చెప్ప సాగాడు :

## వేతాళ కథలు



కీర్తిపురం రాజ్యంలోని గోవిందపురం అనే గ్రామంలో, శ్రీకాంతుడనే యువకుడుండేవాడు. వాడు అనాథ. బాల్యంలో, ఆ ఊరివారి దయాదాక్షిణ్యాల మీద బతికాడు. వయసొచ్చాక శరీరకష్టాన్ని నమ్ముకున్నాడు. శ్రీకాంతుడికి అసమానమైన ధైర్య సాహసాలుండేవి. వాడిది చెప్పుకోదగిన దేహదారుఢ్యం. ఒక్కసారిగా పదిమందిని ఎదుర్కొగలిగిన కండబలం వాడిది.

ఒకసారి, సమీపంలో వున్న అడవి నుంచి, ఒక పెద్దపులి తరచుగా ఆ ఊరిలోకి వచ్చి, దొరికినవాళ్ళను చంపి అడవిలోకి లాక్కుపోసాగింది. వారా సంగతి రాజుకు మనవిచేయాలని ఎంతో ప్రయత్నించారు గాని, ఆ వార్త ఆయన చెవిని పడలేదు.

ఒకనాటి మిట్టమధ్యాహ్నం వేళ, శ్రీకాంతుడు అడవిలో ఒక చెట్టు ఎక్కి గొడ్డలితో ఎండు కొమ్మలు నరుకుతూండగా, ఒక బాలిక ఏడుస్తూ పరిగెత్తుకు రావడం కనిపించింది. ఆమె వెనకగా పులి గాండ్రిస్తూ పరుగు తీస్తున్నది.

ఇది చూసి శ్రీకాంతుడు ఏమాత్రం భయపడకుండా, కొమ్మ మీది నుంచి కిందికి దూకాడు. హఠాత్తుగా తన దారికి అడ్డుగా మనిషి కనబడడంతో, పులి బెదిరిపోయి పక్కకు తిరిగింది. అదే క్షణంలో శ్రీకాంతుడు గొడ్డలితో దాని మెడ మీద బలంగా కొట్టాడు. బాగా గాయపడిన పులి పెద్దగా గాండ్రిస్తూ శ్రీకాంతుడి పైకి దూకింది. శ్రీకాంతుడు గాయపడినా, తెగింపుతో దానితో పోరాడి చంపేశాడు.

ఒంటి నిండా గాయాలతో పడివున్న శ్రీకాంతుడికి, ఊరిజనం బ్రహ్మరథం పట్టారు. వైద్యం చేయించి వాడు కోలుకునే దాకా రాచమర్యాదలు చేశారు.

శ్రీకాంతుడి ధైర్యసాహసాల గురించి విన్న రాజు అభిషిక్తవర్మ, అతణ్ణి పిలిపించి తన కొలువులో భటుడి ఉద్యోగం ఇచ్చాడు.

తర్వాత కొన్నాళ్ళకు పొరుగురాజైన సుమపురి రాజు కాలకేతు, అభిషిక్తవర్మ మీద అకారణంగా యుద్ధం ప్రకటించాడు. యుద్ధభూమిలో ఇరుపక్షాలమధ్య భయంకరమైన పోరు ప్రారంభమైంది. ఆ సమయంలో ఒకచోట రాజులిద్దరూ ఒకరినొకరు గుర్తించి, ద్వంద్వ యుద్ధానికి తలపడ్డారు. ఇంతలో ఒక శత్రు సైనికుడు విసిరిన ఈటె తగిలి, అభిషిక్తవర్మ అశ్వం పెద్దగా సకిలించి వెనకకాళ్ళ మీద లేచింది. అభిషిక్తవర్మ అశ్వం మీద ఒక పక్కకు ఒరిగాడు.



ఇదే అదనుగా భావించి రాజు కాలకేతు, అభిషిక్తవర్మ తలకు ఖడ్గాన్ని గురి చేసేంతలో, మెరుపులా వచ్చిన శ్రీకాంతుడు, ఒక్క దెబ్బతో కాలకేతు చేతిలోని ఖడ్గాన్ని ఎగరగొట్టి, అతణ్ణి అశ్వం మీది నుంచి కిందికి లాగి, తన చేతిలోని కత్తిని అతడి కంఠానికి ఆనించి, "రాజా! లొంగిపో!" అంటూ భీకరంగా అరిచాడు.

ఇది చూసిన కాలకేతు సైనికులు భయకంపితులై, యుద్ధభూమి వదిలి చెల్లాచెదురుగా పారిపోయారు. యుద్ధం ముగిసింది. కాలకేతు బందీ అయ్యాడు.

ఏమాత్రం యుద్ధవిద్యలు నేర్వని శ్రీకాంతుడు, మొండి ధైర్యంతో కాలకేతుణ్ణి ఎదుర్కొని, తనను కాపాడినందుకు అభిషిక్తవర్మ చాలా సంతోషించి, అతడికి, విలువైన కానుకలు బహూకరించబోయాడు.

అయితే, శ్రీకాంతుడు వాటిని తీసుకోక, "మహారాజా, ఎంతటిత్యాగానికైనాసిద్ధపడి, తన ప్రభువును కాపాడడం ప్రతి సైనికుడి కర్తవ్యం. అదే నేను చేశాను," అన్నాడు.

అభిషిక్తవర్మ, అతడి రాజభక్తిని మెచ్చుకుని, యుద్ధవిద్యలలో శిక్షణ ఇప్పించి, తన అంగరక్షకుడుగా నియమించాడు.

ఆ తర్వాత రెండు సంవత్సరాలపాటు తగిన వర్షాలు లేక, కీర్తిపుర రాజ్యంలో తీవ్రమైన కరువు పరిస్థితులు ఏర్పడినై. మహారాజుకు ఏం చేయాలో పాలుపోలేదు.



ఆ స్థితిలో విశాలాక్షుడు అనే జ్యోతిష్కుడు, రాజును దర్శించి, "ప్రభూ, మన రాజ్యానికి దక్షిణదిశన అరణ్య సమీపంలో అతి పురాతనమైన కాళికాలయం ఒకటున్నది. అందులో ఒక శిలాశాసనం వున్నది. ఎవరైనా ప్రాణత్యాగానికి సిద్ధపడి, ఏదైనా కోరితే దేవి, ఆ కోరికను నెరవేరుస్తుంది. అయితే, ప్రాణత్యాగానికి సిద్ధపడిన వ్యక్తిలో, ఏమాత్రం భయ సందేహాలకు తావుండ కూడదు!" అని చెప్పాడు.

ఇది విన్న శ్రీకాంతుడు, రాజుతో, "మహారాజా, దేవికి నా ప్రాణాన్ని సంతోషంగా సమర్పిస్తాను. వర్షాలు కురిపించమని వేడుకుంటాను," అని బయలుదేరి కాళికాలయం చేరాడు.

ఆలయంలోని దేవీ విగ్రహం పక్కన ఒక త్రిశూలం వున్నది. శ్రీకాంతుడు, విగ్రహానికి శిరస్సువంచి నమస్కరించి, "జగజ్జననీ! నా ప్రాణత్యాగంతో వర్షాలు కురిసి రాజ్యం సుభిక్షమయ్యేలా దీవించు!" అంటూ త్రిశూలం ఎత్తి గుండెల్లో పొడుచుకోబోయాడు.

ఆ వెంటనే, "ఆగు, శ్రీకాంతా! నీవంటి త్యాగధనుణ్ణి నేను బలికోరను. నీ రాజ్యం సుభిక్షమవుతుంది," అన్న మాటలు విగ్రహం నుంచి వెలువడినై.

మరుక్షణం త్రిశూలం కళ్ళు జిగేలుమనేలా మెరుస్తూ, ఆకాశంలోకి దూసుకుపోయింది. వెనువెంటనే కుండపోతగా వర్షం ప్రారంభమైంది.

శ్రీకాంతుడు నగరానికి తిరిగివచ్చి, రాజుకు కాళికాలయంలో జరిగినదంతా చెప్పాడు. అభిషిక్తవర్మ, శ్రీకాంతుణ్ణి మెచ్చుకుని, "నీ కారణంగా రాజ్యంలో ఎందరో కరువువాతపడకుండా ప్రాణాలు నిలుపుకున్నారు. రాజ్యంలో నువ్వు కోరిన ప్రాంతానికి నిన్ను సామంతరాజుగా చేయదలిచాను," అన్నాడు.

అందుకు శ్రీకాంతుడు, "మహారాజా, మీ సేవకుడిగా నా ధర్మం నేను నిర్వర్తిం

చాను. నాకే సామంతరాజ్యమూ అవసరం లేదు. మీ సేవకుడిగా ఇలాగే వుండ నివ్వండి," అన్నాడు.

ఇందుకు రాజు ఎంతగానో సంతోషించి, రాణీతో సంప్రతించిన తరవాత శ్రీకాంతుడికి ఆమె ప్రధాన చెలికత్తెతో వివాహం జరిపించాడు. మూడు సంవత్సరాలు గడిచేసరికి శ్రీకాంతుడు ఇద్దరు బిడ్డల తండ్రి అయ్యాడు.



ఆ తర్వాత ఎవరూ ఊహించనివిధంగా కీర్తిపుర రాజ్యానికి మరొక అరిష్టం దాపురించింది. రాజ్య సరిహద్దుల్లో వున్న అరణ్యంలో త్రిజటుడనే రాక్షసుడు చేరి, దారే పోయేవాళ్ళను చంపి తినసాగాడు. రాజు కందిన సమాచారాన్నిబట్టి, వాడు గొప్ప బలశాలి, క్రూరుడు. మహావృక్షాలను వేళ్ళతో పెకలించ గలడు. ఏనుగులూ, ఖడ్గమృగాల్లాంటి వాటిని పిడికిడి పోటుతో చంపగలడు.

రాజు అభిషిక్తవర్మ, ఈ విషయం నిండు సభలో చెప్పి, "ఈ త్రిజటుడి పైకి సైన్యాన్ని పంపవచ్చు. కాని, మనం కొంత సైనిక నష్టానికి గురి కావలసి వస్తుంది. అందువల్ల, ముందు వాడి దగ్గరకు ఒక దూతను పంపదలిచాను. దూత వాడికి మనుషులను చంపి తినడం మానివేస్తే, మన పాకశాల నుంచి రుచికరమైన జంతు మాంసం పంపుతామని చెప్పాలి. అయితే, ఇక్కడ ఒక చిక్కు వున్నది. ఆ రాక్షసుడు తన వద్దకు వచ్చిన దూతనే చంపవచ్చు. ఇదీ పరిస్థితి. ఈ సభలో ఆ రాక్షసుడి దగ్గరకు దూతగా వెళ్ళేందుకు సిద్ధపడేవాళ్ళెవరైనా వున్నారా?" అని అడిగాడు.

సభలోని వాళ్ళందరూ శ్రీకాంతుడి కేసి చూశారు. వాళ్ళ అభిప్రాయం గ్రహించిన రాజు, శ్రీకాంతుడితో, "శ్రీకాంతా! ఇంతకు ముందు నువ్వెన్నో సాహస కార్యాలు చేశావు. ప్రాణత్యాగానికి కూడా వెరవలేదు. రాజ్యంలో నిన్ను మించిన ధీరుడు లేడన్న ఖ్యాతి వున్నది. ఈసారి

కూడా, ఈ కార్యం సాధించుకు రాగలవా?" అన్నాడు.

దానికి శ్రీకాంతుడు, "క్షమించండి, మహారాజా! నేనా రాక్షసుడి వద్దకు దూతగా వెళ్ళలేను," అన్నాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, శ్రీకాంతుడు యుద్ధవిద్యలేవీ నేర్వని దశలోనే, ప్రాణం పోగొట్టుకునేందుకు కూడా సిద్ధపడి, శత్రురాజు కాలకేతుడి మీద కత్తి దూశాడు. రాజ్యాన్ని కరువు కాటకాల నుంచి కాపాడేందుకు, కాళికా దేవికి బలి అయ్యేందుకు సిద్ధపడ్డాడు. వీటినిబట్టి, అతడు ధీరుడూ, సాహస వంతుడూ అని తేలికగా నిర్ణయించవచ్చు. అలాంటి వాడు రాక్షసుడి విషయంలో ప్రవర్తించిన తీరు అసందర్భంగానూ, అవివేకంగానూ లేదా? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "మనుషుల జీవనవిధానం, వారికి ఎదురయ్యే సమస్యలూ, వారివారి మనస్తత్వాన్నీ, ప్రవర్తననూ తీర్చిదిద్దుతవి. ప్రాణహానికి ఆస్కారం గల ఏదైనా గడ్డు సమస్య తటస్థపడినప్పుడు, సాధారణంగా ఏ బాధ్యతలూ లేకుండా ఏకాకిగా జీవించేవాడూ, బాధ్యతల వలయంలో చిక్కుబడిన వాడూ—తప్పక భిన్నంగా ప్రవర్తిస్తారు. శ్రీకాంతుడిప్పుడు ఏకాకి కాదు; భార్యాబిడ్డల క్షేమం, వారిపట్ల బాధ్యతతో ప్రవర్తించవలసినస్థితిలో వున్నవాడు. ఆ కారణంవల్లనే అతడు రాక్షసుడి దగ్గిరకు దూతగా వెళ్ళడానికి నిరాకరించాడు. ఇది అవివేకం కాదు; వివేకంతో కూడిన నిర్ణయం. ఇది అసందర్భం అని గాని, అతడి గౌరవమర్యాదలకు హానికరం అనిగాని అనుకునేందుకు అవకాశం లేదు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)

[ఆధారం: ఎస్. శివనాగేశ్వరరావు రచన]





# పోటీకానుక

పూర్వం ఒక రాజుగారికి ఒక రైతు స్నేహితుడుండేవాడు. రాజుగారు వేటకు వెళ్ళినప్పుడల్లా ఈ రైతు ఇంట ఒక పూట ఉండి, చిలగడ దుంపలు కాల్పించుకు తిని, తన నగరానికి తిరిగివస్తూ ఉండేవాడు.

ఇలా ఉండగా రైతు ఒకనాడు రాజధానికి వెళ్ళవలసి వచ్చింది. రైతు భార్య ఒక కట్టెడు చిలగడ దుంపలు మూటగట్టి ఇచ్చి, "రాజుగారికి చిలగడ దుంపలంటే మహా ఇష్టం! వీటిని తీసుకుపోయి ఆయనకు కానుకగా ఇయ్యి!" అన్నది.

"ఓసి పిచ్చిదానా, రాజుగారు ఇటువంటి కానుకలను చూసి ఏమనుకుంటారు?" అన్నాడు రైతు తన భార్యతో.

"ఇంత దూరం నుంచి నువ్వు తీసుకుపోయినందుకు వారు తినకపోతారా ఏమిటి? ఫరవాలేదు లే! ఏమీ అనుకోరు, పట్టుకెళ్ళు!" అన్నది రైతు భార్య.

భార్య మాట ఎందుకు తీసెయ్యాలని రైతు చిలగడ దుంపల మూట ఎత్తుకుని రాజధానికి బయలుదేరాడు. దారిలో అతడు తన మూటలో నుంచి చిన్న చిన్న దుంపలు ఏరి కొరికి తింటూ నడవసాగాడు. తీరా అతడు రాజధానికి చేరేసరికి మూటలో ఒకే ఒక చిలగడదుంప, బాగా పెద్దది, మిగిలింది.

"దీనిని రాజుగారి కిస్తాను. ఆయన ఎన్నడూ ఇంత పెద్ద దుంప చూసి ఉండడు!" అనుకున్నాడు రైతు.

రాజుగారి దర్శనం కోసం రైతు రాజసభ వద్దకు వెళ్ళి తొంగి చూశాడు. లోపల సభ జరుగుతున్నది. రైతు బయట నిలబడ్డాడు.

కొంతసేపటికి సభ ముగిసింది. రాజుగారు బయటికి వచ్చి తన స్నేహితుడైన రైతును చూసి పలకరించి, కుశల ప్రశ్నలు చేశాడు.

25–ఏళ్ళనాటి చందమామ కథ

రైతు మూటలో నుంచి చిలగడదుంప తీసి, "తమకోసం తెచ్చాను!" అన్నాడు.

రాజుపరమానందంతో చిలగడదుంపను తీసుకుని, పక్కన ఉన్న భటుణ్ణి పిలిచి, "ఒరే, ఈ బహుమానాన్ని మన ఖజానాలో భద్రం చేయించు. తరవాత, కోశాధికారి నడిగి వెయ్యి మొహరీలు తెచ్చి ఈ రైతుకు బహుమానంగా ఇయ్యి!" అన్నాడు.

తరవాత రాజుగారు రైతు కేసి తిరిగి, "మనం భోజనానికి పోదాం పద!" అన్నాడు.

ఎవరో ఊరూ పేరూ లేని రైతొకడు ఒక చిలగడదుంప తెచ్చిఇస్తే రాజుగారు వాడికి వెయ్యి బంగారు మొహరీలు బహుమతి ఇవ్వటమేగాక, తనతోబాటు భోజనం కూడా పెట్టి పంపాడని రాజసభలో ఉండే వారి కందరికీ తెలిసిపోయింది.

రాజుగారు ఇంత దాత అయినప్పుడు లాభంఎందుకుపొందగూడదనే ఉద్దేశంతో, ఒక సభికుడు మర్నాడు ఉత్తమజాతి గుర్రాన్ని ఒకదాన్ని కొని రాజుగారి వద్దకు తెచ్చి, "మహారాజా, ఈమేలుజాతిఅశ్వాన్ని తమకు కానుకగా ఇచ్చుకుంటున్నాను. అనుగ్రహించండి!" అన్నాడు.

ఒక్క చిలగడదుంపకే వెయ్యి మొహరీ లిచ్చినవాడు ఈ గుర్రానికి ఇంకెంత బహుమతి ఇస్తాడోగదా అని సభికుడు ఆశ పడ్డాడు.

ఈ సంగతి రాజుగారు గ్రహించాడు. ఆయనతన పక్కనే ఉన్న భటుణ్ణి పిలిచి, "ఒరే, మన ఖజానాలో దాచమని ఒక చిలగడదుంపపంపాను, దాన్నితీసుకురా!" అని వాడి చెవిలో రహస్యంగా చెప్పాడు.

భటుడువెళ్లిత్వరలోనేచిలగడదుంపతో తిరిగి వచ్చాడు. రాజుగారు ఆ చిలగడ దుంపనుసభికుడికిఇస్తూ, "వెయ్యిమొహరీలు చేసే చిలగడదుంప! నాకు నువ్వు గుర్రం కానుకగా ఇచ్చినందుకు నేను దీన్ని నీకు బహుమతి చేస్తున్నాను!" అన్నాడు.

సభికుడి ఆశ నిరాశ అయిపోయింది. అతని దురాశకు తగిన శాస్తి జరిగిందని సభికులు తమలో తాము చెప్పుకున్నారు.



## మహనీయులు కలలుగన్న భారతదేశం:

# ఉమ్మడి వారసత్వం!

ఉత్తరప్రదేశ్ రాష్ట్రం, అల్మోరా జిల్లాలో 1887 వ సం॥ జన్మించిన పండిట్ గోవింద వల్లభ పంత్ స్వాతంత్ర్య సమరయోధులలో ప్రముఖుడుగా పేరు గాంచాడు. స్వాతంత్ర్యానంతరం ఆయన మన దేశ పరిపాలనా వ్యవహారాలను తీర్చిదిద్దడంలో ముఖ్యమైన పాత్ర వహించాడు. 1955 వ సం॥ నుంచి 1961 వ సం॥ కాలధర్మం చెందేంతవరకు ఆయన భారత దేశాంగ వ్యవహారాల మంత్రిగా పదవీ బాధ్యతలు నిర్వహించాడు. 1957 వ సం॥లో ఆయనకు 'భారతరత్న' బిరుదుప్రదానం జరిగింది.

1946 వ సం॥ డిసెంబర్ 21 వ తేదీ, అలహాబాదు విశ్వవిద్యాలయ స్నాతకోత్సవ ఉపన్యాసంలో గోవింద వల్లభపంత్ ఇలా అన్నాడు:

"భారతదేశ చరిత్ర మనందరి ఉమ్మడి వారసత్వం. మనందరం ఒకే తల్లి బిడ్డలం. మహోన్నతమైన మనదేశ గత వైభవంలో హిందువులకూ, ముస్లింలకూ సమానమైన హక్కు ఉన్నది. మతాలు వేరైనప్పటికీ మన నరాలలో ప్రవహించే రక్తం ఒకటే. యుగయుగాలుగా ఒకే గడ్డ మీద జీవిస్తున్నాం. సుదీర్ఘమైన భారతదేశ చరిత్రలో రాజకీయ, సాంఘిక రంగాలలో వాటిల్లిన ఆటుపోట్లలో మతం ముఖ్యమైన పాత్ర వహించిందనడంలో సందేహం లేదు. అయినప్పటికీ, పరమతసహనం పునాదిగా గలది మన భారతీయ సమాజం!"

## మీకు తెలుసా?

1. సైకిల్ బండిని ఎవరు ఎప్పుడు రూపొందించారు?
2. మొట్టమొదటి 'సర్కస్' నడిపిన వారెవ్వరు? ఎప్పుడు?
3. మొట్టమొదటి 'సినిమా స్టూడియో'ను ఎవరు ఎప్పుడు రూపొందించారు? దాని పేరేమిటి?
4. ఆధునిక సింగపూర్‌ను ఎవరు ఎప్పుడు స్థాపించారు?
5. మన దేశంలోని, కేంద్ర పాలిత ప్రాంతాలలో అతి చిన్నది ఏది? దాని జనాభా ఎంత? అక్కడ ప్రధానంగా మాట్లాడే భాష ఏది?

(36 వ పేజీ చూడండి)

మన దేవుళ్ళు:

# దుర్గామాత



సనాతన భారతీయ సంస్కృతికి ఆధార పురుషులు ఋషులు. కేవలం భౌతిక నేత్రాలకు గోచరించని ప్రకృతిలోని సూక్ష్మ విషయాలను, రహస్యాలను మనోనేత్రాలతో దర్శించిన మహానుభావులు వారు. అందుకే వారిని మహాత్ములు అని అంటారు!

ప్రకృతికి ఆధారమైన దివ్యశక్తి భక్తుల స్వభావాలకూ, అవసరాలకూ అనుగుణంగా రకరకాల రూపాలతో సాక్షాత్కరిస్తుందని ఋషులు పసిగట్టారు. అటువంటి రూపాలలో మాతృరూపం ప్రధానమైనది. మాతృరూపానికి కూడా వివిధ నామరూపాలు ఏర్పడ్డాయి. వాటిలో దుర్గామాత రూపం ముఖ్యమైనది!

ఆసేతు హిమాచల పర్యంతం, అతి ప్రాచీన కాలం నుంచి—వైష్ణవి, కాళి, దుర్గ, కామాక్షి, మూకాంబిక, భగవతి మొదలైన వివిధ నామరూపాలతో దుర్గాదేవికి సుప్రసిద్ధ ఆలయాలు నిర్మించి పూజిస్తున్నారు!

దుర్గాదేవిని పరమశివుడి అర్ధాంగిగా భావించి పూజించడం మన సంప్రదాయం. సతీదేవి, పార్వతి ఆమె అవతారాలు!

దుర్గాదేవి చదుర్భుజాలలో, పై హస్తాలలో విష్ణు సంబంధమైన శంఖుచక్రాలు కొన్నిచోట్ల కనిపిస్తాయి. మహిషాసురమర్దిని వంటి రూపాలలో ఎక్కువ హస్తాలతో వివిధ ఆయుధాలతో దర్శన మిస్తుంది.

విశ్వవినోదిని అయిన దుర్గ వాహనం సింహం!

అందరిపట్లా సమానమైన కరుణ చూపే జగజ్జనని అయిన దుర్గ—మనసారా ప్రార్థించే భక్తుల పాపాలు హరించి, సంకటాల నుంచి రక్షిస్తుందని భక్తులు విశ్వసిస్తారు.

దసరా సందర్భంగా వచ్చే దేవీ నవరాత్రులలో దుర్గామాత ఉత్సవాలు ఘనంగా జరుపుకుంటారు!

# చందమామ కబుర్లు



## రైలును మించిన మనిషి కంఠస్వరం!

జపానుకు చెందిన యోషీహికోకాటో అనే 36 యేళ్ళ వ్యక్తి పరిగెత్తే రైలు కన్నా గట్టిగా కేకపెట్టి, 'అరిచే పందెం'లో విజయం సాధించాడు. అరుపు పందెంలో పాల్గొన్న యోషీహికోకాటో 'యుద్ధం కావాలంటే, వెళ్ళు!" అని గట్టిగా అరిచాడు. ఆ అరుపు 115.8 డెసిబెల్స్ శబ్దాన్ని నమోదు చేసింది. అంటే ఆ శబ్దం—మన తల మీదుగా వెళ్ళే పట్టాల మీద పరిగెత్తే రైలు పుట్టించే శబ్దం కన్నా 15 రెట్లు ఎక్కువన్న మాట!

## సంగీత ఔషధం!

మంచి సంగీతం కొన్ని రకాల వ్యాధుల్ని నయం చేయడానికి ఉపయోగపడుతుందన్న విషయం మనకు తెలుసు. ఇటీవల మాస్కోలో కొందరు వైద్యులూ, మానసిక వైద్యులూ, సంగీతవేత్తలూ కలిసి చేసిన పరిశోధనలో సంగీతానికి వ్యాధి నిరోధకశక్తిని పెంపొందించే శక్తి కూడా వుందన్న విషయం వెల్లడయింది. కొన్ని జానపద గీతాలు పెంపుడు జంతువుల ఆరోగ్యానికి మేలు చేస్తుందన్న విషయం కూడా వెలుగులోకి వచ్చింది!



# సాహిత్యావలోకనం

1. సాహిత్యంలో నోబెల్ బహుమతి పొందిన ఈజిప్టు రచయిత ఎవరు? ఎప్పుడు పొందాడు?
2. భారతీయ భాషలన్నిటినీ ప్రభావితం చేసిన భాష ఏది?
3. ఆ భాషా ప్రభావం నాలుగు దక్షిణ భారతీయ భాషలలో, మరీ ఎక్కువగా కలిగిన భాష ఏది?
4. సంస్కృతం కాకుండా, దాదాపు 2,500 సంవత్సరాలకు పూర్వమే రచింపబడిన వ్యాకరణ గ్రంథం కలిగిన భారతీయ భాష ఏది?
5. జమ్ము, కాశ్మీర్‌లో మాట్లాడే భాష ఏది?
6. సంస్కృతంలో లభిస్తూన్న అతి ప్రాచీనమైన గ్రంథం ఏది?

## సమాధానాలు

**మీకు తెలుసా?**

1. కిర్క్ పాట్రిక్ మేక్మిలన్. 1839 లో.
2. బ్రిటిష్ మాజీ సైనికుడు ఫిలిప్ ఆస్ట్లీ; 1769 లో.
3. థామస్ ఎడిసన్. 1893 వ సం॥ ఫిబ్రవరి 1 వ తేదీన. దానిపేరు 'బ్లాక్ మేరియా'
4. సర్ స్టామ్‌ఫోర్డ్ రాఫిల్స్; 1819 లో.
5. లక్షద్వీపాలు; జనాభా 40 లక్షలు; మలయాళం.

**సాహిత్యం**

1. నజీబ్ మహఫౌజ్, 1988 వ సం॥
2. సంస్కృతం.
3. తెలుగు.
4. తమిళం; 'తొల్‌కాప్పియం'
5. డోగ్రి.
6. ఋగ్వేదం.



ప్రపంచ పురాణగాథలు - 3

# అనుకోని వరం

పురాతన ఆర్గోస్ నగరంలో, శని గ్రహం కుమార్తె జూనో దేవత ఆలయం ఉండేది. ప్రసిద్ధిగాంచిన ఆ దేవాలయ ప్రధాన పూజారిణి సైడిప్పే.

సైడిప్పేకు క్లియోబిస్, బైటన్ అనే ఇద్దరు కొడుకులు ఉండేవారు. వాళ్ళు మంచి శరీరదారుఢ్యంతో, ఆటపాట లలో అందరికన్నా మిన్నగా ఉండే వాళ్ళు.





ఒకసారి, తల్లీ, ఇద్దరు కొడుకులూ కలిసి, దూరప్రాంతంలో ఉన్న బంధు వుల ఇంటికి ఒక బండిలో బయలు దేరారు. వాళ్ళు గమ్యస్థానం చేరుకో గానే, దురదృష్టవశాత్తు, బండికి పూన్చిన రెండు గుర్రాలూ మరణిం చాయి.



తిరుగుప్రయాణానికి కొత్త గుర్రాల కోసం, ఆ యువకులు ఎక్కడెక్కడో వెదికారు. ఎందరెందరినో అడిగారు. కాని, ప్రయోజనం లేకపోయింది. సాయంకాలమయ్యేసరికి, వాళ్ళు ఏం చేయడానికీ తోచక సతమతమయ్యారు.

మరునాడు ఉదయమే జూనో ఆలయంలో ప్రత్యేక పూజా కార్యక్రమం ఒకటి జరుగుతుంది. ఆ సమయంలో ఆలయ ప్రధాన పూజారిణి అయిన వాళ్ళ తల్లి అక్కడ ఉండి తీరాలి. వృద్ధురాలయిన ఆమె అంతదూరం నడిచే స్థితిలో లేదు.





అన్నదమ్ములు సమస్యను గురించి బాగా ఆలోచించి, ఆఖరికి ఒక నిర్ణయానికి వచ్చి, తల్లిని బండి ఎక్కమన్నారు. కొడుకులు ఎక్కడి నుంచో గుర్రాలను ఏర్పాటు చేశారనుకుని తల్లి, బండి ఎక్కి కూర్చున్నది!

అయితే గుర్రాలకు బదులు, ఆ యువకులే స్వయంగా బండిని లాగడానికి పూనుకున్నారు. ఆ దృశ్యాన్ని చూసి తల్లి బాధపడింది. కాని, గుడికి చేరుకోవాలన్న తపన కొద్దీ, ఆమె వారిని వారించలేక ఊరుకున్నది!





అన్నదమ్ము లిద్దరూ, ఎత్తయిన ప్రదేశాలను దాటుకుంటూ, బండిని లాగసాగారు. అప్పుడే వర్షం ప్రారంభమయింది. అయినా వాళ్ళు ఆగలేదు. పూజాసమయం సమీపించే కొద్దీ వాళ్ళు మరింత వేగంగా బండిని లాగసాగారు!

తెల్లవారేసరికి వాళ్ళు నగరాన్ని సమీపించారు. ఆ యువకుల సాహసాన్నీ, మాతృభక్తినీ చూసి, నగర ప్రజలు ఆనందంతో జేజేలు పలికారు. ఒళ్ళంతా చెమటలతో, రోజుతూ రొప్పుతూ, పూజాసమయం దాటకముందే వాళ్ళు బండిని ఆలయం ముందు తెచ్చి వదిలారు.





పూజా కార్యక్రమం నిర్విఘ్నంగా పూర్తయ్యాక, పూజారిణి—తన బిడ్డలకు జీవితంలో ఎలాంటి దుఃఖాలూ, బాధలూ లేని, మానవులు కోరుకోతగిన అత్యున్నతవరం ప్రసాదించమని—దేవతను ప్రార్థించింది.

విశ్రాంతి తీసుకోవడానికి అన్నదమ్ములు శయనగృహానికి వెళ్ళి పడుకుని హాయిగా నిద్రపోయారు. అలా ఎంత కాలం నిద్రపోయారో గాని, ఆ తరవాత వాళ్ళు కళ్ళు తెరవనే లేదు!





ఆ విధంగా ఆదర్శమూర్తులయిన ఆ యువకులు జీవితంలో ఎలాంటి బాధలూ, దుఃఖాలూ అనుభవించలేదు! ఆర్గోస్ నగర ప్రజలు త్యాగధనులయిన ఆ యువకుల గౌరవార్థం బ్రహ్మాండమైన విగ్రహాలు ప్రతిష్ఠించారు!



# ఆత్మగౌరవం

కల్యాణవరంలో వుండే సుధాముడు, కష్టపడి కూలీనాలీ చేసుకుంటూ, తన స్వశక్తిని మాత్రమే నమ్ముకుని జీవిస్తూండేవాడు. ఏనాడైనా కూలిపని దొరకనప్పుడు, తన కుటుంబంతో సహా పస్తులుండడమే కాని, ఎవరినీ దేహీ అని అర్థించేవాడు కాదు.

సుధాముడు బీదవాడైనా చాలా ఆత్మగౌరవం కలవాడని, ఊళ్ళో అందరూ అనుకునేవారు. కాని, కొద్దిమంది మాత్రం అతడి ఆత్మగౌరవాన్ని పొగరుగా అపోహపడి, అతడిపై అకారణంగా ద్వేషం పెంచుకునేవాళ్ళు.

అదే ఊళ్ళో పశుపతి అనే షావుకారు వున్నాడు. ఆయన కూలిపనులు చేసుకు బతికే సామాన్య ప్రజానీకానికి, అవసరంలో అప్పులిచ్చి అధికవడ్డీలు వసూలు చేసేవాడు. ఏనాడూ తన దగ్గిరకు అప్పుకోసం రాకపోవడమేగాక, తనంటే ప్రత్యేకమైన గౌరవ మర్యాదలు చూపని సుధాముడంటే, పశుపతికి ఈర్ష్యగా వుండేది.

ఒకసారి పొరుగూరు నుంచి, పశుపతి వియ్యంకుడు సోమనాధుడు చుట్టపుచూపుగా వచ్చాడు. ఆయన మాటల సందర్భంలో పశుపతితో, "మీ ఊళ్ళో సుధాముడనే కూలివాడున్నాడే, వాణ్ణి మనిషిని పంపి ఒకసారి పిలిపించండి," అన్నాడు.

అందుకు పశుపతి, "సుధాముడా! వాడు ఒట్టి పొగరుబోతువెధవ. ఇంతకూ వాడితో మీకు పనేమిటి?" అని అడిగాడు.

పశుపతి అలా అడగగానే సోమనాధుడు ఆశ్చర్యపోయాడు. ఎందువల్లనంటే, ఆయన సుధాముణ్ణి బాగా ఎరుగు. వాడంటే ఆయనకు సదభిప్రాయం వున్నది.

దాసరి వెంకటరమణ

"సుధాముడు కూలిపనులకు, మా ఊరు వచ్చి పోతూంటాడు. వాడు మీరను కున్న లాంటివాడు కాదు. కాకపోతే కొంత ఆత్మగౌరవం కల మనిషి," అన్నాడు సోమనాధుడు.

పశుపతి నవ్వి, "అందరూ వాణ్ణి పొగరుబోతుగానే భావిస్తారు," అన్నాడు.

సోమనాధుడు కూడా నవ్వి, "మీకు పొగరుబోతుతనానికీ, ఆత్మాభిమానానికీ తేడా బాగా తెలిసినట్టు లేదు," అన్నాడు.

"సరే, ఇంతకూ మీకు వాడితో పనేమిటి?" అని అడిగాడు పశుపతి కొంచెం విసుగ్గా.

"వాడు మా ఊళ్ళోని తిరుపతయ్యకు నాలుగు రోజులు కల్లంలో కుప్పకొట్టే పనులు చేశాడు. దానితాలూకూ కూలి డబ్బులు ఆయన నాకిచ్చి పంపాడు," అన్నాడు సోమనాధుడు.

పశుపతి వెంటనే తన పనివాడితో, సుధాముణ్ణి పిలుచుకురమ్మన్నాడు. అయితే, సుధాముడి ఆత్మాభిమానం ఏపాటిదో పశుపతికి తెలియపరచాలనే ఉద్దేశంతో సోమనాధుడు, పనివాణ్ణి వెనక్కుపిలిచి, "నేను వచ్చినట్టు వాడికి చెప్పకు. మీ అయ్యగారే పిలుస్తున్నారని చెప్పి, తీసుకురా," అని చెప్పాడు.

ఇంటి ముందున్న చెట్టుకింద తాడు పేనుతూ, పక్కన కూర్చుని వున్న ఒక ముసలివాడితో ఏదో మాట్లాడుతున్న సుధాముడు. పశుపతి పనిమనిషి చెప్పింది



విని, "ఈ చేస్తున్నపని ముందు పూర్తి చేయాలి. మీ అయ్యగారితో నాకేం పని లేదు. ఒకవేళ ఆయనకు అంత అవసరం అయిన పని వుంటే వచ్చి వెళ్ళమను," అని సమాధానం ఇచ్చాడు.

అది విని పక్కన వున్న ముసలివాడు, "అదేమిట్రా, సుధామా! అంత పెద్ద మనిషి పిలిస్తే, రానని చెబుతావేం?" అని అడిగాడు.

సుధాముడు తేలిగ్గా నవ్వేస్తూ, "ఆయన వడ్డీలెలా గుంజుతాడో నాకు బాగా తెలుసు. డబ్బులోనే ఆయన పెద్దమనిషి!" అన్నాడు.

పశుపతి పనివాడు తిరిగివచ్చి, ఏం జరిగిందీ చెప్పగానే, పశుపతి కోపంగా సోమనాధుడితో, "చూశారా, వాడి కెంత తలపొగరో!" అన్నాడు.

సోమనాధుడు, అతణ్ణి శాంతపరుస్తూ, "మీరొక విషయం మరిచిపోతున్నారు. పిలవగానే రావడానికి వాడు మీ పనివాడు కాదు గదా," అన్నాడు.

"అయితే మాత్రం, ఊళ్ళో అందరి కన్నా ఎక్కువ స్థోమతు గలవాడినన్న గౌరవంతోనైనా, పిలుపు వింటూనే రావాలి గదా?" అన్నాడు పశుపతి.

సోమనాధుడు ఒకక్షణం మౌనంగా ఊరుకుని తర్వాత, "ఒకటి గుర్తుంచుకోండి. మీరలా పనివాణ్ణి పంపగానే వచ్చి, చేతులు కట్టుకుని మీముందు నిలబడే వాళ్ళు—మీతో అవసరం వున్నవాళ్ళో



లేక రేపు మీ నుంచి ఏదైనా సాయం అవసరం కావచ్చు అని భావించేవాళ్ళో అయివుంటారు. కానీ సుధాముడి తత్వం వేరు. వాడు చాలా ఆత్మాభిమానం గల మనిషి,'' అన్నాడు.

ఆ మాటలకు పశుపతి అయిష్టంగా తలాడించాడు.

అప్పుడు సోమనాధుడు, ''సుధాముడిది తలపొగరు కాదనీ, ఆత్మగౌరవం అనీ ఇప్పుడే రుజువుచేస్తాను,'' అంటూ పని వాణ్ణి పిలిచి, ''మీ అయ్యగారు జ్వరంతో బాధపడుతున్నారనీ, చాలా అవసరం అయిన పని వున్నదనీ సుధాముడికి చెప్పు,'' అన్నాడు.

పనివాడినుంచి ఇది వింటూనే సుధాముడు ఆదుర్దాపడుతూ వచ్చి, పశుపతికీ, సోమనాధుడికీ నమస్కరించి, పశుపతితో, ''మీకు ఒంట్లో కులాసాగా లేదని ఇప్పుడే విన్నాను!'' అన్నాడు.

''నా ఒంట్లో కులాసా మాటకేంగాని, మా వియ్యంకుడికి నీతో ఏదో పని పడింది,'' అంటూ పశుపతి చిరునవ్వు నవ్వాడు.

సోమనాధుడు, సుధాముడికి డబ్బు లిస్తూ, ''ఇది మా ఊరి తిరుపతయ్య, నీకివ్వవలసిన కూలి తాలూకూ డబ్బు, నాచేత పంపాడు,'' అన్నాడు.

సుధాముడు డబ్బు తీసుకుని, సోమనాధుడికీ, పశుపతికీ నమస్కరించి వెళ్ళి పోయాడు.

అప్పుడు సోమనాధుడు, పశుపతితో, ''చూశారా, మీరనుకుంటున్నట్టు సుధాముడు పొగరుబోతు అయివుంటే, మీరు రెండవసారి కబురు పంపినప్పుడు కూడా వచ్చి వుండేవాడు కాదు. మీరు జ్వరంతో వున్నారని విని, ఏదైనా సాయం కావాలేమో అన్న సానుభూతితో వెంటనే వచ్చాడు. అవునంటారా?'' అన్నాడు.

పశుపతి అవునన్నట్టుతల వూపి, "మనుషుల స్వభావాలను అర్థం చేసుకోవడం ఎంత కష్టం! ఇంతకాలంగా వాడు కేవలం పొగరుబోతనే పొరబడ్డాను,'' అన్నాడు.






స్వయంప్రభ ధర్మమా అంటూ బిలం నుంచి బయట పడిన వానరులకు ఎట్టెదట సముద్రం, పెద్ద పెద్ద కెరటాలతో ఘోషపెట్టుతూ కంటపడింది. వాళ్ళు వింధ్యపర్వతపు నైరృతి ప్రాంతంలో పుష్పవృక్షాల కింద ఒక తిప్ప మీద చేరి ఆలోచన చేశారు; ఎందుకంటే, సుగ్రీవుడు పెట్టిన గడువు దాటిపోయింది. వాళ్ళు సుగ్రీవుడి ఆగ్రహానికి చాలా భయపడ్డారు.

ఆ స్థితిలో, యువరాజైన అంగదుడు మిగిలిన వానరులతో ఇలా అన్నాడు:

"వానరులారా, మనను పంపిన సుగ్రీవుడు మనకు నియమించిన నెల గడువు, మనం ఋక్షబిలంలో ఉండగానే తీరిపోయిన సంగతి మీకు తెలుసుగదా? మొట్టమొదట, హనుమంతుడి సూచన మీద సుగ్రీవుడు మనకు పదిహేను రోజులు గడువు ఇచ్చి పిలిపించాడు. ఇది ఆశ్వయుజ మాసంలో జరిగింది. తరవాత లక్ష్మణుడు కోపించి వచ్చిన మీదట మళ్ళీ పది రోజులు గడువిచ్చి సుగ్రీవుడు మనలనందరినీ పిలిపించాడు. తరవాత మనకు తిరిగి రావటానికి ఒక్క మాసం గడువు ఇచ్చాడు. ఆ గడువు తీరిపోయింది. ఇప్పుడు మనం ఏం చెయ్యాలో ఆలోచించండి. మనకేమో సీత జాడ ఇంకా తెలియలేదు. మనం సుగ్రీవుడి ఆజ్ఞను రెండు విధాలా ఉల్లంఘించాం. అమిత కఠిన స్వభావుడైన సుగ్రీవుడు

9. సంపాతి కథ



మనను తప్పక చంపేస్తాడు. మనం అక్కడికి తిరిగి వెళ్ళి, భయంకరంగా చావటం కన్న, ఇక్కడే ప్రాయోపవేశం చేసి, ప్రాణాలు విడవటం మంచిది. సుగ్రీవుడికి నా మీద సద్భావం లేదు. నన్ను యువరాజును చేసినవాడు రాముడే గాని సుగ్రీవుడు కాడు. అందుచేత నెపం దొరికితే ఆయన నన్ను చంపక మానడు. అయిన వాళ్ళందరికీ దుఃఖం కలిగేటట్టుగా నేను కిష్కింధలో ఎందుకు చావాలి? ఇక్కడ నిరశన వ్రతం అవలంబించి, ఈ సముద్రతీరాన చచ్చిపోతాను.''

ఈ మాటలకు వానర వీరులంతా దుఃఖించి, ''మనం సీత సమాచారం తెలుసుకో గలిగితే సుగ్రీవుడి వద్దకు పోదాం. లేకపోతే ఇక్కడే చచ్చిపోదాం,'' అన్నారు.

''మనం చావటం దేనికి? ఈ బిలంలోకి వెళ్ళి, అక్కడ హాయిగా ఉందాం. విచారించకండి. ఈ బిలంలోకి ఎవరూ రాలేరు. ఇక్కడ తినటానికీ, తాగటానికీ పుష్కలంగా వున్నది. ఇక్కడ మనకు రాముడి భయంగానీ, సుగ్రీవుడి భయంగానీ లేదు,'' అన్నాడు తారుడు.

ఈ మాటలన్నీ వింటున్న హనుమంతుడు తనలో, ''సుగ్రీవుడి వానర రాజ్యాన్ని అంగదుడు తప్పక కాజేస్తాడు. ఈ వాలి కొడుకు సూక్ష్మబుద్ధి గలవాడు, దేశ కాలాలు తెలిసినవాడు,'' అనుకున్నాడు.

అతను అంగదుడితో, ''అంగదుడా, నువ్వు యుద్ధంలో నీ తండ్రికన్న గొప్పవాడివికావు. చపలచిత్తులైన ఈ వానరులు ఎల్లప్పుడూ నీ వెంట ఉండరు. వాళ్ళకు భార్యలూ, బిడ్డలూ ఉన్నారు. నన్నూ, ఈ జాంబవంతుణ్ణీ, ఇతర వానర వీరులనూ సుగ్రీవుడి నుంచి వేరుచేసి నీ పక్షం చేసుకోవటం నీకు సాధ్యం కాదు. ఈ ఋక్ష బిలం లక్ష్మణుడి బాణాలకు గొప్ప ప్రతిబంధకం కాదు; అతను దీన్ని ఆకును ఛేదించినట్టు ఛేదిస్తాడు. అసలు నువ్వు

సుగ్రీవుడి మీద విరోధం కట్టి ఈ బిలంలో ప్రవేశిస్తే, ఈ వానరులు నిన్ను విడిచి పెట్టేస్తారు. తరవాత నువ్వు గడ్డిపోచ విలువ చెయ్యవు. రామలక్ష్మణులు నిన్ను ప్రాణాలతో వదలరు. సుగ్రీవుడు ధర్మాత్ముడు. అతనికి నీ పైన పగలేదు. పైపెచ్చు నీ తల్లి అంటే చాలా గౌరవం గలవాడు. ఆమె కొడుకువైన నిన్ను తన కొడుకులాగే చూసుకుంటాడు," అన్నాడు.



హనుమంతుడి మాటలను అంగదుడు ఆమోదించక, "సుగ్రీవుడిలో ఏ సుగుణమూ లేదు. తన అన్న తనను గుహ వద్ద కాపు పెట్టి, శత్రువు బయటికి రాకుండా చూడమని చెప్పి లోపలికి పోతే, సుగ్రీవుడు దుర్బుద్ధితో గుహకు రాయి అడ్డం పెట్టాడు. రాముడివల్ల అంత ఉపకారం పొంది, ప్రత్యుపకారం చెయ్యటం మాట మరిచాడు. చివరకు అతను సీతను వెదికిస్తున్నది కూడా లక్ష్మణుడికి భయపడే గాని, సద్బుద్ధితో కాదు. అలాటి వాడికి, నేను ఇప్పుడు అందరికీ తెలిసినట్టు చేసిన ఆలోచన తెలిసిన మీదట ప్రాణాలతో ఉండగలనా? నేను కిష్కింధకు రాను. ఇక్కడే ప్రాయోపవేశం చేస్తాను. మీరంతా కిష్కింధకు తిరిగి వెళ్ళండి: రామలక్ష్మణుల క్షేమం అడిగానని చెప్పండి," అన్నాడు.

అంగదుడు ఇలా అని, తన తల్లి అయిన తారను తలుచుకుని దుఃఖిస్తూ, నేల మీద దర్భలు పరుచుకుని, వాటి మీద పడుకున్నాడు. అది చూసి వానరులందరూ పెద్దగా ఏడ్చారు. అంగదుడి నిశ్చయం మారదని గ్రహించి, వాళ్ళందరూ సముద్రంలో స్నానాలు చేసి, దర్భలు పరుచుకుని, వాటి మీద తాము కూడా పడుకున్నారు. తరవాత వాళ్ళు తమలో తాము రాముడి వనవాసం గురించీ, సీతాపహరణం గురించీ, జటాయువు మరణం గురించీ, వాలి వధ గురించీ, తమ సీతాన్వేషణ గురించీ మాట్లాడుకోసాగారు.



వానరుల కోలాహలం విని, ఒక గుహ నుంచి పెద్ద గద్ద ఒకటి బయటికి వచ్చి, "అహా, నాకు కడుపు నిండా కావలసినంత తిండి!" అన్నది.

ఆ మాట విని వానరులు హడలి పోయారు.

అంగదుడు హనుమంతుడితో, "ఈ గద్ద సూర్యుడి కొడుకైన సంపాతి. రాముడి కోసం జటాయువు రావణుడితో యుద్ధం చేసి ఎలా ప్రాణాలు వదిలినదీ మనకు తెలుసు గదా. మనం అలా రామ కార్యంలో ప్రాణాలు పోగొట్టుకున్న వాళ్ళమైనా కాలేకపోయాం," అన్నాడు ఎంతో బాధగా.

ఈ మాటలు విని సంపాతి గట్టిగా, "నా తమ్ముడైన జటాయువు చచ్చాడని చెప్పి నా మనస్సుకు బాధ కలిగిస్తున్న వాడెవడు? జటాయువుకూ, రావణుడికీ యుద్ధం ఎందుకు జరిగింది? చాలా కాలానికి జటాయువు పేరు వింటున్నాను," అని అరిచాడు.

తరవాత అతను వానరులతో, "వానరులారా, సూర్యుడి కిరణాలకు నా రెక్కలు కాలిపోయాయి. ఈ పర్వతం మీద నుంచి నేను దిగి రాలేను. నన్ను కిందికి దింపండి," అన్నాడు.

తమను తింటానన్న సంపాతి మాటలు వానరులు నమ్మలేకపోయారు. కాని, తాము ఎలాగూ చచ్చిపోవటానికే నిశ్చయించుకున్నప్పుడు సంపాతి తింటాడని భయపడటం అనవసరమనుకున్నారు.

అంగదుడు కొండ మీదికి వెళ్ళి, సంపాతిని కిందికి తెచ్చి, అతనికి జరిగినదంతా ఇలా చెప్పాడు:

"ఇక్ష్వాకువంశపు రాజైన దశరథుడి కొడుకు రాముడు తండ్రి మాట శిరసావహించి, తమ్ముడు లక్ష్మణుణ్ణీ, భార్య సీతనూ వెంటబెట్టుకుని దండకారణ్యానికి వచ్చాడు. అతను జనస్థానంలో ఉండగా రావణుడు సీతను బలాత్కారంగా ఎత్తుకుపోయాడు. రావణుడు ఆకాశమార్గాన

పోతూండగా, దశరథుడికి మిత్రుడైన జటాయువు చూశాడు. జటాయువు రావణుడితో యుద్ధం చేసి, కొంతసేపు సీతను కాపాడి, చివరకు చనిపోయాడు. రాముడు జటాయువుకు సంస్కారం చేసి, మా ప్రాంతానికి వచ్చి, మా పినతండ్రి అయిన సుగ్రీవుడితో స్నేహం చేసి, నా తండ్రి అయిన వాలిని చంపి, సుగ్రీవుణ్ణి వానర రాజును చేశాడు. ఆ సుగ్రీవుడి అజ్ఞ మీదనే మేం సీత కోసం వెతుకుతూ ఇలా వచ్చాం. మాకు సీత జాడ తెలియలేదు. మేం వెనక్కు తిరిగి పోతే నిశ్చయంగా రాముడి చేతనో, సుగ్రీవుడి చేతనో మరణం పొందుతాం,'' అన్నాడు.



సంపాతి పెద్ద గొంతుతో, ''వానరులారా, మీరు, రావణుడితో యుద్ధం చేసి చనిపోయాడని చెప్పే జటాయువు నా తమ్ముడు. ముసలివాణ్ణి; రెక్కలు లేనివాణ్ణి; రావణుణ్ణి చంపి పగ తీర్చుకోలేను. ఏం చెయ్యను? వృత్రాసురుడి వధ జరిగిన రోజుల్లో, అన్నదమ్ములిద్దరమూ పోటీపడి ఎగిరిపోతూ, సూర్యుడికి సమీపంగా వెళ్ళాం. సూర్యుడు నడినెత్తికి వచ్చేసరికి జటాయువు ఎండ దెబ్బ తిన్నాడు. అప్పుడు నేను వాడికి ఎండ తగలకుండా నా రెక్కలు అడ్డం పెట్టాను. ఆ కారణంగా నా రెక్కలు కాలాయి. నేను వింధ్యపర్వతం మీద పడ్డాను. అది మొదలు నేను ఇక్కడే ఉంటున్నాను. నా తమ్ముడి సమాచారం తెలియరాలేదు,'' అన్నాడు.

ఈ మాట విని అంగదుడు సంపాతిని, ''ఆ రాక్షస రాజైన రావణుడు ఎక్కడ ఉంటాడో తెలుసునా?'' అని అడిగాడు.

''నాయనలారా, ఆ రావణుడు ఒక అందమైన స్త్రీని తీసుకుపోవటం నేను స్వయంగా ఎరుగుదును. ఆమె 'రామా, రామా', అని కేకలు పెట్టటాన్ని బట్టి సీతే అయి ఉండాలి. ఇక రావణుడు లంక అనే నగరంలో ఉంటాడు. అతను విశ్రవసుడి కొడుకు; కుబేరుడి తమ్ముడు.



సముద్రం మధ్య ఇక్కడికి నూరు యోజనాల దూరంలో ఒక ద్వీపం మీద లంకా నగరం ఉన్నది. మీరు సముద్రం దాటి లంకా నగరం చేరారంటే మీకు అక్కడ రావణుడూ, సీతా కూడా కనిపించవచ్చు. మీరు రాముడి చేత ఆ రావణుణ్ణి చంపించారంటే నా పగ తీరుతుంది. మీరు సముద్రం దాటే మార్గం చూడండి,'' అన్నాడు సంపాతి.

తరవాత వానరులు తనను సముద్ర తీరానికి చేర్చగా, సంపాతి తన తమ్ముడైన జటాయువుకు జలతర్పణాలు విడిచాడు. సీత జాడ తెలిసినందుకు వానరులకు అమితానందం కలిగింది.

జాంబవంతుడు మిగిలిన వానరుల పక్షాన సంపాతితో, సీతాపహరణం గురించి ఇంకా వివరంగా చెప్పమన్నాడు. దానికి సంపాతి ఇలా చెప్పాడు:

''నేను రెక్కలు కాలి, ఈ వింధ్య పర్వతం మీద పడిపోయినది మొదలు ఇక్కడే ఉండి, వృద్ధుణ్ణి అయిపోయాను గద. అందుచేత నా కొడుకు సుపార్శ్వుడు నాకు వేళకు ఇంత తిండి తెచ్చిపెడుతూ ఉంటాడు. ఒకనాడు వాడు సూర్యాస్తమయం అయిన దాకా రాకపోగా, ఆలస్యంగా వచ్చిన వాడు ఆహారం తీసుకు రాకుండా వచ్చాడు. అసలే ముసలివాణ్ణి, దానిపైన ఆకలితో ఉండటం చేత, వాడి మీద మండిపడ్డాను. అప్పుడు వాడు నన్ను శాంతపరుస్తూ, జరిగిన సంగతి చెప్పాడు. వాడు సరిఅయిన వేళకే మహేంద్ర పర్వతం మీదికి ఆహారం కోసం వెళ్ళాడట. అప్పుడు వాడికి నల్లటి వాడొకడు ధగధగ మెరిసే స్త్రీని తీసుకుపోతూ కనిపించాడు. మా వాడు వాళ్ళనే ఆహారంగా పట్టుకుందామని వాళ్ళకు అడ్డం వెళ్ళాడు. ఆ నల్లనివాడు సుపార్శ్వుణ్ణి మర్యాదగా, అడ్డం తొలగమన్నాడు. ఆ మనిషి మర్యాదను పాటించి సుపార్శ్వుడు వాళ్ళకు దారి ఇచ్చాడు. తరవాత ఆ మనిషి అతివేగంగా వెళ్ళిపోయాడట. తరవాత

సుపార్శ్వుడు ఆకాశభూతాలను అడగగా ఆ నల్లటివాడు రాక్షస రాజైన రావణుడనీ, రామలక్ష్మణులను ఎలుగెత్తి పిలిచే ఆ స్త్రీ సీత అనీ, రావణుడు ఆమెను ఎత్తుకుపోతున్నాడనీ తెలిసింది. ఇదే వాడు ఆలస్యంగా రావటానికి కారణం.''



తరవాత వానరులు సంపాతిని తిరిగి పర్వతం మీదికి చేర్చారు. అక్కడ వానరప్రముఖులకు తన పాత అనుభవాలను సంపాతి ఇలా చెప్పాడు:

''నేను రెక్కలు కాలి ఈ వింధ్య పర్వతం మీద పడినప్పుడు ఇక్కడ ఒక ఆశ్రమం ఉండేది. అందులో నిశాకరుడు అనే గొప్ప మహర్షి ఉండేవాడు. ఇదంతా ఎనిమిదివేల ఏళ్ళనాటి సంగతి. పర్వతం మీద పడిపోయిన నేను అతికష్టం మీద మిట్టపల్లాలను దాటుకుంటూ ఆ మహర్షి ఆశ్రమానికి వచ్చాను. అక్కడ ఒక చెట్టు కింద మహర్షి దర్శనం కోసం వేచి ఉన్నాను. అప్పుడు నాకొక వింత కనిపించింది. దక్షిణదిశ నుంచి ఆయన స్నానం చేసి వస్తూంటే, ఆయన వెంట ఎలుగుబంట్లూ, చమరీమృగాలూ, పులులూ, సింహాలూ, ఏనుగులూ, సర్పాలూ రావటం నాకు కనబడింది. ఆయన ఆశ్రమంలోకి వెళ్ళగానే అవి అన్నీ వెళ్ళిపోయాయి. లోపలికి పోతూ నన్ను చూసిన నిశాకరమహర్షి, కొంతసేపటికి తిరిగి వచ్చి, 'గద్దలకు రాజులైన ఇద్దరు అన్నదమ్ములను నేను ఎరుగుదును. అందులో నువ్వు పెద్ద వాడైన సంపాతివి కాదూ? జటాయువు నీ తమ్ముడు కదా? మీరిద్దరూ అప్పుడప్పుడూ మనుష్యరూపాలలో నాకు కనబడి నమస్కరించే వాళ్ళు. నీ కేమైనా జబ్బుగాని చేసిందా? నీ రెక్కలు ఎందుకు పడిపోయాయి? నిన్ను ఎవరైనా శిక్షించారా?' అని అడిగాడు.

''నేను ఆ మహర్షికి జరిగినదంతా చెప్పాను. కైలాసపర్వతం మీద రుషుల దగ్గిర నేనూ, నా తమ్ముడూ శపథం చేసి,

సూర్యుడు అస్తమించే లోపల సూర్యుడి వెనకాల ఎగిరిపోతామన్నాం. మేం చాలా ఎత్తుకు ఎగిరాం. భూమి మీద ఉన్న నగరాలన్నీ బండిచక్రాల ప్రమాణంలో కనిపించాయి. దారిలో మాకు వేదఘోష వినిపించింది; ఎర్రని చీరలు ధరించి పాటలు పాడే స్త్రీలు కనిపించారు. ఇంకా ఎత్తుకు ఎగిరాం. అడవులు పచ్చిక బీళ్ళలాగానూ, పర్వతాలు చిన్న రాళ్ళలాగానూ, నదులు దారపు పోగులలాగానూ కనిపించాయి. మాకు ఆయాసంతో బాటు భయమూ, మతిచలించటమూ, దృష్టి చెదరటమూ, మూర్ఛరావటమూ లాటి లక్షణాలు కూడా కలిగాయి. దిక్కులు తెలియరాలేదు. ఆ ఎత్తున సూర్యుడూ, భూమీ ఒకే ప్రమాణంలో కనిపించారు.

"అంతలో జటాయువు స్పృహతప్పి నేల మీద పడసాగాడు. వెంటనే నేను కూడా దిగివస్తూ, జటాయువును నా రెక్కలతో కప్పాను. ఆ సమయంలో జటాయువు సూర్యుడి వేడి నుంచి తప్పించుకున్నాడు గాని, నా రెక్కలు కాలిపోయాయి. జటాయువు జనస్థానంలో పడ్డాడనుకుంటాను. ఇదంతా నిశాకర మహర్షికి చెప్పి, నాకు జీవించాలని లేదనీ పర్వతం మీది నుంచి దూకి చచ్చిపోతాననీ అన్నాను.

"ఆ మహర్షి నాకు రానున్నది చెప్పాడు. మీరు సీతను వెతుకుతూ వస్తారనీ, నేను మీకు సహాయం చేస్తాననీ, తరవాత నాకు రెక్కలు వస్తాయనీ, నన్ను ఇక్కడే ఉండమనీ ఆయన అన్నాడు."

ఇలా అంటుండగానే సంపాతికి రెక్కలు రావటం వానరులకు కనబడింది. ఆ రెక్కల ఈకలు ఎర్రగా ఉన్నాయి. సంపాతి పరమానంద భరితుడై, "నిశాకరమహర్షి చెప్పినట్టే నాకు మళ్ళీ రెక్కలు వచ్చాయి. బలం తిరిగి వచ్చింది. దీన్ని బట్టి మీ ప్రయత్నం తప్పక విజయవంతమవుతుంది. నేను నా రెక్కల బలం చూసుకుంటాను," అంటూ ఆకాశంలోకి ఎగిరిపోయాడు.






# వెండికోరలు

ఒక ఊళ్ళో సూరన్న, గోపన్న అని ఇద్దరు మిత్రులుండేవాళ్ళు. ఇద్దరూ నా అన్న వాళ్ళు లేని అనాథలు. అలాగే వాళ్ళకు వుండడానికి ఇల్లూ వాకిలీ కూడా లేదు. వాళ్ళు పగలల్లా ఊళ్ళో కూలీనాలీ చేసుకుని, వచ్చిన డబ్బుతో బియ్యం, పప్పూ, ఉప్పూ కొనుక్కుని సాయంకాలానికి ఊరి బయట వున్న పెద్ద మర్రిచెట్టు కిందికి చేరేవాళ్ళు.

ఆ మర్రిచెట్టు బోదెలో ఒక పెద్ద తొర్ర వున్నది. అందులోనే వాళ్ళు వంట పాత్రలూ, బట్టలూ అవీ దాచుకునేవాళ్ళు. చెట్టుకిందే మూడు రాళ్ళు పేర్చి వంట ముగించి, దాపులనున్న మడుగులో స్నానం చేసి, రాత్రి వండుకున్నది వేడిగా తిని ఉదయానికి కొంత మిగుల్చుకునే వాళ్ళు. తర్వాత తుండుగుడ్డలు పరచుకుని చీకూచింతా లేకుండా నిద్ర పోయే వాళ్ళు. ఈ విధంగా వాళ్ళ ఇల్లూ వాకిలీ అంతా, ఆ మర్రిచెట్టే.

సూరన్న, గోపన్నలకు కొండంత ఆశ ఒకటుండేది. అదేమంటే—ఏనాటికైనా ఆ చెట్టు ప్రాంతాల ఒక గుడిసె వేసుకుని, పెళ్ళిళ్ళు చేసుకుని స్థిరపడి పోవాలని. అందుకోసం వాళ్ళు కొంత డబ్బు కూడబెట్టి దాచుకోవడం ప్రారంభించారు.

ఒక రోజు సాయంత్రం మిత్రులిద్దరూ కూలిపనులు ముగియగానే, బియ్యం అవీ కొనుక్కుని చెట్టు దగ్గరకుపోయి, వంట పని ప్రారంభించబోతున్నంతలో, చెట్టు తొర్రలోంచి రెండు పొడవైన చేతులు వంటపాత్రలు వాళ్ళకు అందించాయి.

ఇది చూసి సూరన్నా, గోపన్నా ఆశ్చర్య పోతున్నంతలో, చేటంత ముఖం వున్న భూతమొకటి తొర్రలోనుంచి తొంగి చూసి, "మీరు లేనప్పుడు, మీ తొర్రలో చేరి

గవ్వల నిర్మలాదేవి



నందుకు ఏమీ అనుకోకండి; మిత్రులారా!'' అన్నది.

ఆ మాటలతో వాళ్ళు ధైర్యంతెచ్చుకుని, ''ఎన్ని గుండెలు నీకు! మేం లేనప్పుడు, మా చెట్టుతొర్రలో జొరబడడమే కాక, ఇంత వాళ్ళమైన మమ్మల్ని మిత్రులారా అంటూ వరసొకటి కలుపుతావా? బయిటికిరా, నీ అంతు తేల్చేస్తాం!'' అన్నారు.

వాళ్ళలా అనగానే భూతం దమ్మిడీ అంత ముఖం చేసుకుని, తొర్రలోంచి చెంగున బయిటికి దూకి, సూరన్న గోపన్నల కాళ్ళ మీద పడి గొల్లుమంటూ, ''మీరు కూడా కాదు కూడదంటే, నేనెక్కడ తల దాచుకోగలను? నాతోటి భూతంగాళ్ళ మధ్య వుండేందుకు, నాకెలాగూ అర్హతలేదు. వాళ్ళు నన్ను వెలివేశారు. మిమ్మల్ని ఒక రోజల్లా చాటుగా వుండి గమనించి, మంచివాళ్ళని మీ పంచ చేరాను!'' అన్నది.

భూతం దుఃఖం చూసి మిత్రులిద్దరూ కాస్త శాంతించి, ''నీ తోటివాళ్ళ మధ్య వుండడానికి, నీకు అర్హతలేదా? కారణం ఏమిటి?'' అని అడిగారు.

అప్పుడు భూతం నోరు బానలా తెరిచి చూపించి, ''చూశారు గదా, నా కోరలు రెండూ ఊడిపోయాయి. ఇలాంటి భూతం తమ మధ్య వుండడం అవమానమని, మిగిలిన భూతాలు నన్ను గెంటేశాయి. ఇక్కడ వుండనిస్తే, మీకు చేదోడు వాదోడుగా పడివుంటాను. మీరు తినే వాటిల్లో నాకూ గుప్పెడు మెతుకులు పడేయండి చాలు,'' అన్నది.

అందుకు సూరన్న, ''మా జానెడు పొట్టలు నింపుకోడానికి, ఇప్పటికే పడరాని పాట్లు పడుతున్నాం. నీ బానెడుకడుపు నింపాలంటే మాటలా! మరెక్కడికైనా పో,'' అన్నాడు.

అయితే గోపన్న, సూరన్నను తొందర పడవద్దని, భూతంతో, ''ఇంతకూ నీ కోరలెలా వూడిపోయావో చెప్పావు కాదు!'' అన్నాడు.



భూతం గోపన్నకేసి దిగులుగా చూస్తూ, "అదంతా ఒక పెద్ద కథ...." అంటూ ఏదో చెప్పబోయేంతలో సూరన్న కోపంగా, "కూలీనాలీ చేసుకుబతికే మాకు పెద్ద కథ కాదు గదా, చిన్న కథ కూడా వినే తీరు బాటు లేదు." అని గోపన్నతో, "ఒరే, నీకు బుద్ధి వుందా? ఏ భూతం కోరలు ఎలా వూడితే, నీ కెందుకు?" అన్నాడు.

అప్పుడు భూతం ఏడుపు గొంతుతో, "కోరలు లేనందువల్లనేకదా, నా ఆహారం నేను సంపాదించుకోలేని అసమర్థుణ్ణయి పోయాను. ఛీ, నాలాంటి చచ్చుభూతం వుండేం, లేకేం!" అంటూ తలను మర్రి చెట్టు బోదెకేసి గట్టిగా కొట్టుకున్నది.

అది చూసి సూరన్నకు కూడా మనసు కరిగి, "సరే, అట్టే దిగులుపడక, ఇక్కడే బుద్ధిగా పడివుండు," అన్నాడు.

భూతం ఆ మిత్రులిద్దరికీ వంగివంగి దణ్ణాలు పెట్టింది. గోపన్న మరొకసారి భూతాన్ని కోరలు వూడిపోయిన కారణం ఏమిటో చెప్పమని అడిగాడు.

భూతం అందుకు పెద్దగా నిట్టూర్చి, "సమయం వచ్చినప్పుడు తప్పక చెబుతాను. ఇప్పటికే బాగా చీకటిపడి పోయింది. వంట ప్రారంభించాలి." అని చిటికెలో వంట పూర్తిచేసి సూరన్న, గోపన్నలతోపాటు తానూ వడ్డించుకున్నది. భూతం వంట మిత్రులిద్దరికీ చాలా బావున్నది, తృప్తిగా తిన్నారు.

మరుసటిరోజు ఉదయం భూతం సూరన్న, గోపన్నలకంటే ముందుగానే నిద్రలేచి, చెట్టు కింద వున్న చెత్తాచెదారమంతా వూడ్చి శుభ్రం చేసింది. తర్వాత వాళ్ళ మాసిన బట్టలన్నీ మడుగు దగ్గరకు తీసుకుపోయి, మల్లెపువ్వుల్లా ఉతికి ఆరవేసింది. వంటకు కావలసినఎండుపుల్లలు, ఏరుకువచ్చింది. భూతం పనితనం చూసి మిత్రులిద్దరూ ముచ్చటపడ్డారు.

సూరన్న, గోపన్నలు ఆ రోజు, మును పటికన్నా ఎక్కువగా కష్టించి పని చేశారు. ఎందుకంటే—ఇప్పుడు భూతం



దారిలో సూరన్న, గోపన్నతో, "ఏరా, గోపన్నా! మనుషులకు పళ్ళూడితే బంగారుపళ్ళు కట్టించుకున్నట్టు, మనం భూతంగాడికి కూడా, బంగారు కోరలు కట్టిస్తే ఎలా వుంటుందంటావు?" అని అడిగాడు.

"బంగారు కోరలా!" అంటూ గోపన్న ఆశ్చర్యపోయి, "మనం కూడబెట్టిన డబ్బు ఖర్చుపెట్టి వెండికోరలు చేయించి కట్టిద్దాం. దాని అవసరానికి ఏ కోర లయితేనేం? దానితో భూతం పూర్వపు శక్తి సామర్థ్యాలతో మనం కోరినవి తెచ్చి పెడుతూ, కృతజ్ఞతగా మన కాళ్ళదగ్గిర పడి వుంటుంది. పైగా దాని ఆహారం అదే సంపాయించుకుని, మనల్ని కూడా పోషిస్తుంది. ఈ సంగతి భూతానికూ్కడా చెబితే చాలా సంతోషిస్తుంది," అన్నాడు.

ఆ మర్నాడు వాళ్ళిద్దరూ, భూతానికి సంగతి చెప్పి, కూడబెట్టిన డబ్బంతా తీసుకుని పట్నానికి ప్రయాణమయ్యారు. భూతం కళ్ళవెంట ఆనందబాష్పాలు రాల్చింది.

పట్నం చేరిన మిత్రులిద్దరికీ, ఒక అనుమానం వచ్చింది. వెండీ, బంగారు వస్తువులు చేసే ఎవడివద్దకైనా వెళ్ళి, కోరలు చేసి యివ్వమని ఎలా అడగడం? వాళ్ళు ఒకళ్ళిద్దర్ని అలా అడగగా, వాళ్ళు

పోషణ భారం కూడా వాళ్ళ మీద పడింది. అనడానికి భూతం గుప్పెడు మెతుకులు చాలన్నా, రాత్రి కుండెడు అన్నం అవలీలగా తినేసింది.

ఆ సాయంత్రం లెక్కచూసి డబ్బులిచ్చేటప్పుడు షావుకారు వాళ్ళను, "ఏరా, మీరు గుట్టు చప్పుడుకాకుండా పెళ్ళిళ్ళేమయినా చేసుకున్నారా? రోజు కన్నా ఎక్కువ సంపాదనలో మునిగిపోయారు!" అని నవ్వుతూ అడిగాడు.

అలా షావుకారు నవ్వినప్పుడు, ఆయన నోటిలోని బంగారపుపన్ను తళుక్కున మెరిసింది. ఆ క్షణంలో సూరన్న, గోపన్నలకు ఒక ఆలోచన వచ్చింది.

సూరన్న, గోపన్నలను దయ్యాలను, చూసినట్టు చూసి దడుచుకున్నారు.

మిత్రులిద్దరూ కొంతసేపు రకరకాల ఆలోచనలు చేసి, చివరకు శరభయ్య అనే అతడి దగ్గిరకు వెళ్ళి, తాము ఒక నాటకసమాజం మనుషులమనీ, అందులో భూతం వేషం వేయబోతున్నవాడికి వెండి కోరలు కావాలనీ, కథ కల్పించి చెప్పారు.



శరభయ్య సరేనని, వాళ్ళ దగ్గిర డబ్బు తీసుకుని, వారం రోజుల్లో రమ్మన్నాడు. వాళ్ళు వారం గడిచాక శరభయ్య దుకాణానికి వెళ్ళారు. ఆ సమయంలో శరభయ్య పక్కన, ఏడేళ్ళ కుర్రవాడు ఉన్నాడు. వాడు వెండికోరలను అటూ ఇటూ తిప్పిచూస్తూ, శరభయ్యను ఏవో ప్రశ్నలడుగుతున్నాడు.

శరభయ్య, గోపన్న, సూరన్నలను చూస్తూనే, "రండి! రండి! సమయానికే వచ్చారు," అని పక్కన నిలబడి వున్న కుర్రవాణ్ణి వాళ్ళకు చూపుతూ, "వీడు, నా కొడుకు గురులింగం. ఈ వెండికోరల గురించి యక్షప్రశ్నలతో నన్ను హైరానా పెట్టేస్తున్నాడు," అన్నాడు.

గురులింగం మిత్రులిద్దరికేసీ ఆశ్చర్యంగా చూసి, "మీరేనా, ఈ వెండి కోరలు చేయించినవాళ్ళు? మీరేదో భూతం నాటకం వేస్తారటకదా! ఆ కథ కాస్త చెప్పండి. అసలు భూతం వెండి కోరలు ఎందుకు తగిలించుకుంటుంది, మీ నాటకంలో?" అని అడిగాడు.

సూరన్న, గోపన్న కేసి ఏం చెబుదాం? అన్నట్టు చూశాడు. గోపన్న ఒక్కక్షణం ఆలోచించి, "ఆఁ, ఆ కథా—మరేం లేదు! ఒక మాంత్రికుడి దగ్గిర సీసాలో ఒక భూతం వుంటుంది. అది సోమరిపోతే కాదు, మహా పెంకెది కూడా. కొన్నాళ్ళు చూసి మాంత్రికుడు, దాని కోరలు పీకి తరిమేస్తాడు. అది ఒక పేదవాడి దగ్గిర చేరి, తన దీనావస్థ చెప్పుకుంటుంది. వాడు జాలిపడి తను కూడబెట్టిన డబ్బుతో, దానికి రెండు వెండి కోరలు చేయించి



ఇస్తాడు. అప్పటి నుంచీ, ఆ భూతం వాడికి ఎంతో సహాయం చేస్తూ, బుద్ధిగా వుంటుంది,'' అన్నాడు.

గురులింగం అంతా విని పకపకనవ్వి, ''మీ కథలో పెద్ద లోపమే వున్నది. సోమరిపోతూ, పెంకిదయిన భూతం మనిషికి మాత్రం ఎందుకు సాయం చేస్తుంది? కోరలు పెట్టుకుని, తన దారిన తాను పోతుంది,'' అన్నాడు.

సూరన్న, గోపన్నలు వాడి మాటలకు బెదురుకుని, వెండికోరలు తీసుకుని బయలుదేరారు. దారిలో గోపన్న, ''ఆ కుర్రవాడు చెప్పినట్టుగా, భూతం మనల్ని మోసం చేయదుగదా?'' అన్నాడు.

అందుకు సూరన్న, ''మనది మంచి భూతంలా కనిపిస్తున్నది. అయినా దాని పుట్టుపూర్వోత్తరాలు అడిగి తెలుసుకుందాం,'' అన్నాడు.

వాళ్ళు మర్రిచెట్టు దగ్గిరకొచ్చి, శరభయ్య దుకాణంలో జరిగినదంతా భూతానికి వివరంగా చెప్పి, ''ఆ కుర్రవాడు చెప్పినట్టుగా నువ్వు మమ్మల్ని మోసగించ చూశావో, ఆ కనబడే మడుగులో పాతిపెడతాం,'' అన్నారు.

భూతం కళ్ళనీళ్ళు పెట్టుకుని, ''ఇక ఇప్పుడు, నా కోరలు ఎలా పోయాయో, ఎంతో మేలు చేసిన మీకు చెప్పక తప్పదు,'' అని, ఇలా చెప్పింది:

''నన్ను పట్టుకుని సీసాలో బంధించిన వాడి పేరు భూతాలప్రేతయ్య. వాడికి పిశాచాలపీరయ్య అనే మాంత్రిక మిత్రుడొకడున్నాడు. వాడూ ఒక భూతాన్ని పట్టుకున్నాడు. ఆ మంత్రగాళ్ళిద్దరూ, నా భూతం గొప్ప శక్తిగలదంటే, నా భూతం గొప్ప శక్తిగలదని పేచీలు పడుతూ, మా మధ్య పోటీలు పెట్టేవారు.. తాటిచెట్లను కూకటివేళ్ళతో పీకి భుజాన వేసుకుని, ఆమడదూరం పరిగెత్తిరావడం, నదిలో దూకి మొసళ్ళతో కుస్తీపట్లుపట్టి, వాటిని ఒడ్డున పడవేయడం—ఇలా వుండేవి ఆ పోటీలు.

''ఒకసారి ఆ దుష్టులిద్దరికీ, ఒక విపరీతమైన ఆలోచన వచ్చింది. రెండు బండరాళ్ళకు లావుపాటి మోకులు బిగించి కట్టి, ఆ మోకును పళ్ళతో పట్టుకుని, నేనూ నా సాటిభూతం, రాళ్ళను కోసుడుదూరంలో వున్న ఒక గుట్ట మీదికి లాక్కుపోవాలి. ఈ పోటీ సమయంలో, నా రెండు కోరలూ ఊడిపోయి, నేనోడిపోయాను. దానితో ఉగ్రుడైపోయిన ప్రేతయ్య, నన్ను చింతబరికెలతో బాది వెళ్ళగొట్టాడు. నేను మీ పంచచేరాను.''

ఇది విని సూరన్న, గోపన్న చాలా సంతోషించారు. ఇంత శక్తిగల భూతం, తమకు ఎక్కడినుంచయినా నిధినిక్షేపాలు తవ్వి తెచ్చిపెట్టగలదనుకున్నారు. ఆ తర్వాత ఈ కూలీనాలీ పనులు మాని, ఒక పెద్ద మేడ కట్టుకుని, పెళ్ళిళ్ళు చేసుకుని సుఖపడిపోవచ్చు!

ఇలా అనుకుంటూ వాళ్ళు, భూతానికి వెండికోరల్ని, శరభయ్య చెప్పిన విధంగా అమర్చి, దాన్ని మడుగునీళ్ళ దగ్గిరకు తీసుకుపోయి, నీళ్ళలో ముఖం చూసుకోమన్నారు.

భూతం నోరుతెరిచి నీళ్ళలో తన నీడ చూసుకుని, ఉత్సాహంగా చప్పట్లుచరిచి, ''ఆహాఁ, ఏం వెండికోరలు! ఊడిపోయిన వాటికంటే, ఇవే వేయిరెట్లు బావున్నవి," అంటూ రివ్వున గాలిలోకి లేచి, సూరన్న, గోపన్నలు ఏదో అడగపోయేలోపలే మాయమైపోయింది.

మిత్రులిద్దరూ దిగులుగా మర్రిచెట్టుకేసి బయలుదేరారు. అప్పుడు సూరన్న, గోపన్నతో, ''ఒరే, చిన్నవాడయినా, ఆ శరభయ్య కొడుక్కు వున్న బుద్ధి మనకు లేకపోయింది. ఆ కుర్రవాడు చెప్పిన తర్వాతయినా, మనం భూతాన్ని తరిమేసి వుండవలసింది. ఇదేదో ఒరగబెడుతుందని, దాచుకున్న డబ్బంతా, దాని వెండి కోరలకు ఖర్చుపెట్టేశాం,'' అన్నాడు.

జవాబు చెప్పేందుకు గోపన్నకు ఏమీ తోచక, అవునన్నట్టుగా తలాడించి వూరుకున్నాడు.






# అన్యాయం ఎవరిది?

పూర్వం బాగ్దాద్ నగరంలో అలీ అనే క్షురకుడు ఉండేవాడు. వాడు అందరి లాంటివాడు కాడు. క్షౌరం చేయటంలో వాడికి గొప్ప నైపుణ్యం ఉండేది. బాగ్దాదులోని ధనికులూ, పలుకుబడి గల వారూ అలీ చేతనే క్షౌరం చేయించుకునేవారు.

ఒకనాడు అలీ ఇంట్లో వంటచెరుకు కావలిసివచ్చింది. అందుచేత కట్టెలవాళ్ళ కోసం చూస్తూ అతను వీధివాకిట నిలబడ్డాడు. కొద్దిసేపట్లోనే కట్టెలుకొట్టేవాడొకడు గాడిద మీద కట్టెలమోపు వేసుకుని అటుగా వచ్చాడు. అలీ వాణ్ణి పిలిచి, "నాకు నీతో బేరమాడేటందుకు తీరిక లేదుగాని, ఆ గాడిద మీద ఉన్న కర్రయావత్తూ అయిదు రూపాయలకిచ్చేస్తావా?" అని అడిగాడు.

బాగ్దాదులో వంటచెరుకుకు గిరాకీ హెచ్చు. సులువుగా దొరకదు కూడా. అయినా, ఆ పేదవాడు, పెద్ద బేరం గదా అని, సరేనన్నాడు. వాడు గాడిద మీది కట్టెలన్నీ దింపేసి డబ్బు అడిగాడు.

"గాడిద మీది కర్రయావత్తూ దించలేదు. గాడిద వీపున ఉన్న కొయ్యజీను మాట యేమిటి? అంతా కలిపే మాట్లాడాను," అన్నాడు అలీ.

"అదెట్లా?" అన్నాడు కట్టెలుకొట్టేవాడు.

"ఆ జీనుమాత్రం కర్రదికాదా? గాడిద మీద ఉన్న కర్రయావత్తూ నేను అయిదు రూపాయలకిబేరంచేశాను," అన్నాడుఅలీ.

"ఇదేం బేరమండోయ్? దీనికి నేను ఒప్పను," అన్నాడు కట్టెలవాడు.

ఇది విని అలీ కట్టెలవాడి దవడ వాయగొట్టి, కట్టెలూ జీనూ కూడా లాక్కుని, పంపేశాడు. ఇలా దెబ్బలు తిన్న కట్టెలవాడు చెప్పలేని బాధతోనూ, దుఃఖంతోనూ ఏడుస్తూ న్యాయాధికారివద్దకు పోయి

ఆరేబియా జానపదకథ

జరిగినది విన్నవించుకున్నాడు. కాని ఆ న్యాయాధికారికి క్షౌరం చేసేది అలీయే కావటం చేత, ఆయన కట్టెలవాడి మొర వినిపించుకోలేదు.

కట్టెలవాడు ఇంకా పెద్ద న్యాయాధికారి దగ్గిరికి వెళ్ళి మొర పెట్టుకున్నాడు. కాని ఆయనకూ అలీయే క్షురకుడు. కట్టెలవాడి మొర ఆయనకూడా పెడచెవి పెట్టాడు.

"నాకెవరూ సహాయం చేసేవాళ్ళు లేరు. నా గతి ఇంతే!" అనుకుంటూ కట్టెలవాడు ఇంటిదారి పట్టాడు. వాడికి దారిలో ఒక ముసలివాడు ఎదురై, "ఏమిటి, నాయనా, అంత విచారంగా ఉన్నావు?" అని అడిగాడు. అందుకు కట్టెలవాడు ముసలివాడి దగ్గిర తన సొద వెళ్ళబోసుకున్నాడు.

"దీనికే ఇంత బేజారైపోతావెందుకు? నువ్వు మన ఖలీఫా దగ్గిరికి వెళ్ళి చెప్పుకో. నీకు న్యాయం జరగవచ్చు," అని ముసలివాడు కట్టెలవాడికి సలహా ఇచ్చాడు.

కట్టెలవాడు రాజభవనానికి వెళ్ళి, ఖలీఫాను దర్శించి ఆయన పాదాలవద్ద నేలను తాకి సలాము చేశాడు. ఖలీఫా, వాడు వచ్చినపని విచారించాడు. కట్టెలవాడు జరిగినదంతా చెప్పాడు.

"న్యాయం అలీపక్షమే ఉన్నది. అయినా నీకు ధర్మం జరిగే ఉపాయం చెబుతాను. విను," అంటూ ఖలీఫా కట్టెలవాడి చెవిలో ఒక రహస్యం చెప్పాడు. కట్టెలవాడు ఖలీఫాకు మరొకసారి సలాం చేసి నవ్వుతూ ఇంటికి వెళ్ళిపోయాడు.



కొద్దిరోజులు గడిచాక కట్టెలవాడు అలీవద్దకు పోయి, "నాకూ, నా నేస్తానికీ క్షౌరం చెయ్యటానికి ఏం పుచ్చుకుంటావు ?" అని అడిగాడు.

"రెండు రూపాయలిస్తే మీ ఇద్దరికీ క్షౌరం చేస్తాను," అన్నాడు అలీ.

"మంచిది. ముందు నాకు క్షౌరం చెయ్యి," అన్నాడు కట్టెలవాడు.

వాడి తల నున్నగా గొరిగేసినాక అలీ, "నీ నేస్తమెక్కడ ?" అని అడిగాడు.

"బయట ఉండవచ్చు. లోపలికి తీసుకొస్తాను," అంటూ కట్టెలవాడు బయటికి పోయి తన గాడిదెను లోపలికి లాక్కొచ్చాడు.

"ఇదుగో నా నేస్తం. క్షౌరం చెయ్యి," అన్నాడు కట్టెలవాడు.

"ఏమిటీ? గాడిదకు క్షౌరం చెయ్యమంటావా ?" అన్నాడు అలీ మండిపడి.

వెంటనే కట్టెలవాడు ఖలీఫావద్దకు పోయి అలీ మీద ఫిర్యాదు చేశాడు. ఫిర్యాదు విని ఖలీఫా తన భటులను పిలిపించి, "అలీని కత్తులతోసహా తక్షణం పట్టుకురండి !" అని ఆజ్ఞాపించాడు. వాళ్ళు అలీని పట్టుకొచ్చారు.

"ఈ మనిషి నేస్తానికి క్షౌరం చెయ్యటానికి ముందు మాట ఇచ్చి తరవాత చేయనని నిరాకరించావుట, ఏమిటి కారణం?" అని అడిగాడు ఖలీఫా కోపంగా.

అలీ నేలకు వంగి సలాంచేస్తూ, "ఏలినవారు చెప్పినది నిజమేగాని, మనిషికి గాడిద నేస్తం కావటం గాని, గాడిదకు క్షౌరం చెయ్యటం గాని లోకంలో ఎక్కడైనా కద్దా ?" అని అడిగాడు.

"నువ్వన్నదీ నిజమే. కాని జీనును వంట చెరుకు కింద కొనటం మటుకు ఎక్కడైనా కద్దా ? వెంటనే ఈ గాడిదకు క్షౌరం చెయ్యి," అన్నాడు ఖలీఫా.

అలీకి తప్పలేదు. వాడు గాడిద శరీరానికి సబ్బునురుగు రాచి క్షౌరంచేస్తూంటే దర్బారులోనివారంతా విరగబడి నవ్వారు. అలీ పరువంతా బుగ్గిలో కలిసిపోయింది. నాటి నుంచీ ఎవరూ అతడివద్ద క్షౌరం చేయించుకునేవారు కాదు.



## ప్రకృతి వింతలు:

### అతి పెద్ద సొరచేప



1978 వ సం॥ అజోర్స్ దీవుల సమీపంలో లభించిన సొరచేప (వైట్‌షార్క్) ప్రపంచంలో కెల్లా చాలా పెద్దదని చెబుతున్నారు. 29 అడుగులు 6 అంగుళాల పొడవు గలిగిన ఈ చేప బరువు దాదాపు 4,536 కి॥ గ్రా॥

### భూ భ్రమణవేగం తగ్గించిన తుపాను!

1983 వ సం॥ పసిఫిక్ సముద్రంలో లేచిన అతి శక్తివంతమైన తుపాను, భూభ్రమణ వేగాన్ని సైతం తగ్గించింది. కొన్ని రోజులపాటు భూభ్రమణ వేగం రోజుకు మిల్లీ సెకండులో ఐదో వంతు తగ్గింది. భూగోళ వాతావరణంలో వాయువు 8.5 శాతం ఎక్కువయింది।



### పొడవైన ఏనుగు దంతాలు



న్యూయార్క్ జూవలాజికల్ సొసైటీలో ప్రదర్శనకు వుంచిన ఏనుగు దంతాలే ఇంతవరకు లభించిన వాటిలో చాలా పొడవైనవి. కుడి దంతం పొడవు 11 అడుగులా 5½ అంగుళాలు. ఎడమ దంతం పొడవు 11 అడుగులు.

**సరికొత్త సీరియల్ ప్రారంభం!**



హిమాలయ పర్వత సానువులలో తపస్సు చేస్తున్న ఒక మహాముని ఒకానొక విచిత్ర ప్రయోగం చేయడానికి సంకల్పించాడు. తన తపోబలంతో దివ్యశక్తులు గల ఒక అందమైన వ్యక్తిని సృష్టించాడు. చూడడానికి బొమ్మలాగా ఉన్నప్పటికీ మెరుపులాంటి వేగం గల ఆ 'అపూర్వుడు' మానవజాతిని పట్టి పీడించే రుగ్మతలను పోగొట్టడానికి బద్ధకంకణుడై బయలుదేరాడు।

చిత్రవిచిత్రమైన సంఘటనలతో అద్భుతరసప్రధానమైన
అపూర్వుడి జీవితగాథను వివరించే

## 'అపూర్వుడి సాహసయాత్రలు'

చందమామ వచ్చేనెల సంచికలో ప్రారంభమవుతుంది!

## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1991 ఏప్రిల్ నెల సంచికలో ప్రకటింపబడును.



I. Uma Rani



K. Sitha Ram

★ పై ఫొటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ ఫిబ్రవరి నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/–లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి: – చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

---

### డిసెంబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: మోయలేని బరువు! రెండవ ఫోటో: బరువు తెలియని వయసు!

పంపినవారు: దంతాల మధుకర్, లక్ష్మీనగర్, హైదరాబాదు—500 038.

బహుమతి మొత్తం రు. 50/– నెలాఖరులోగా పంపబడుతుంది.


## చందమామ

ఇండియాలో సంవత్సర చందా: రూ. 36-00

చందా పంపవలసిన చిరునామా:

చందమామ పబ్లికేషన్స్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600 026

Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.


---